# Atyadbhuta rahasyaratnākaramu

## Vijayanagaraṃ, 1928

Record no. 405

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

అత్యద్భుత రహస్యరత్నాకరము.- 1. కూర్పు.- విజయనగరం : ఆంధ్ర గ్రంథాలయము, 1928.

(1), 4, 2, 38, ii p. ;21 cm.

Record no. 405

Atyadbhuta rahasyaratnākaramu.- 1. kūrpu.- Vijayanagaraṃ : Āṃdhra Granthālayamu, 1928.

(1), 4, 2, 38, ii p. ;21 cm.

Record no. 405

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB　　　Date filming began:

ఓం

శ్రీ

# అత్యద్భుత రహస్యరత్నాకరము.



ప్రచురణ కర్తలు:—

ఆంధ్ర గ్రంథాలయము,

విజయనగరం, (విశాఖపట్నం జిల్లా)



మొదటి కూర్పు—500.



ఇయ్యది సిటీ ప్రీమియర్ ప్రెస్ వారిచే

ముద్రితము.

విజయనగరం.

1928.





పోస్టేజీ కాక
వెల 0-8-0.

ఇదివరకే 5000 ప్రతులుఅయిపోయినవి. ఇయ్యది 3 వ యెడిషను.

# భైరాగిచిటికీలు

పరమహంసక్రియలు. శుద్ధక్రియలు.

అమూల్యమైన

## వైద్యశాస్త్రము.

ఇట్టిది ముందెన్నడు ప్రచురింపబడలేదు.

ఈగ్రంథము లోకోప కారము కొరకు ప్రచురింపబడినది. ఈగ్రంథమువలన అతిసులభముగ సమస్తమైన వ్యాధులను వైద్యుని సహాయము నక్కఱలేకయే పోగొట్టుకొనవచ్చును. ఈగ్రంథము ప్రతియింటను తప్పక నుండతగినదని యొకసారి చదువువారలకే తెలియగలదు. ఈగ్రంథమునందు గొప్పమహాపురుషులును, పరమహంసలును దెల్పిన శుద్ధక్రియలు వ్రాయబడినవి. రోగములు మాన్పుకొనుటకు మిక్కిలి ద్రవ్యమును పోగొట్టుకొనకయే యెవరి యింటవారు ఈగ్రంథముచేత సమస్తమైనవ్యాధులను మాన్పుకొనవచ్చును. ఇదియొకగ్రంథమున్న మరివైద్యుని అవసరములేదు. వెలసులభము, ఫలమధికమని గ్రంథముచదివినవెనుక మీకే తెలియగలదు. ఇట్టిగ్రంథరాజమును మీరుఇదివరకెన్నడును చూచియుండరు. వేయేల! ఈగ్రంథరాజము సర్వజనోపయోగమని పొత్తముచదువువారలే బల్కెదరు. గాన గ్రంథమునకై త్వరపడుడు. తప్పకచదువుడు. ఇందలి పరమహంసక్రియలను చేసిసుఖింపుడు.

భైరాగిచిటికిలు ప్రతులు వి. పీ. గా పంపబడును. ఒకప్రతి వెల పోష్టుఖర్చులుకాక రు 0-8-0. రెండుప్రతులు ఒకసారి తెప్పించుకొనువారికి పోష్టుఖర్చులు వుచితము, మూడుప్రతులు ఒక్కసారి తెప్పించుకొనువారికి పోష్టుఖర్చులు వుచితమేకాకుండ ఒకప్రతి కూడ వుచితముగాయివ్వబడును. ప్రతులువలయువారు యీదిగువ చిరునామాకు వ్రాయవలెను:— మేనేజరు,

ఆంధ్రగ్రంథాలయము, పోష్టుబాక్సు 20, దివాంజి వీధి, కస్పా విజయనగరం, [విశాఖపట్నం జిల్లా.]

# నమ్మకమైన బుక్కుసెల్లర్సు కావలెను!

## త్వరపడుడు!! త్వరపడుడు!!!

మావద్ద వెలకుదొరకు తెలుగు, ఇంగ్లీషు (English) అరవము (Tamil) మొదలగు పుస్తకములు యిదివరకు కని, విని, యెరుగనివి మంచి కమీషనుపైనిగాని, మొత్తముగా తీసుకొనుటకుగాని బుక్కుసెల్లర్సు, ఏజెంట్లు, హోల్‌సేలు వర్తకులు కావలెను. యిదియే మంచితరుణము. శాంపిలు కాపీలు నమ్మకమైనవారికి అర్ధచార్జీకి కోరిన పంపబడును. మా పుస్తకములన్నియు ప్రపంచమందెల్లడను ప్రశిద్ధ గ్రంథములని వేనవేలు యోగ్యతాపత్రికల వడశినవి. మా పుస్తకములన్నియు యితరభాషలలో మేము అచ్చువేయునివి కాపీరైటు యిచ్చుటకు కూడా శిద్ధముగా యున్నాము. గాన కోరువారు ముందుగా వ్రాయవలయును. యిదియే మంచితరుణము ఈ తరుణమును పోగొట్టుకొని పిదప చింతించిన లాభములేదు. మా పుస్తకములన్నియు సుప్రసిద్ధ జ్యోతిష్కులని ప్రఖ్యాతిగాంచిన శ్రీ॥ భారతీ భూషను ప్రొఫెసరు ప్రకాశరావు గారిచే అతిసులభశైలిని తెలుగుభాషనందును కావలసినవారికి యింగ్లీషు (ఆంగ్లేయభాష) నందునుకూడా వెలకుదొరకును. యీ గ్రంథములన్నియు వారి అనుభవ జ్ఞానామృతసారముతో నిండియున్నవని చూచినవారికే తెలియుననుట నిస్సంశయము. వీటెనిగురించి విస్తరముగా యీ క్రింద నుదహరించితిమి. కొంచెము శ్రద్ధవహించి చదువవలయునని మా ముఖ్యాభిప్రాయము. మా చిరునామా:—

శ్రీ కళింగ జ్యోతిషనిలయము,

(పోస్టు) విజయనగరము,

(విశాఖపట్నం జిల్లా).

# మావద్ద వెలకుదొరకు ఆంధ్రగ్రంథములు

ఈగ్రంథములన్నియు మిక్కిలి సులభమయిన తెలుగులో సుప్రసిద్ధజ్యోతిష్కులని ప్రపంచమందెల్లడను ప్రఖ్యాతిగాంచిన శ్రీ॥ భారతీ భూషణ, ప్రొఫెసరు ప్రకాశరావుగారిచే,వ్రాయబడినవి.

జ్యోతిషరహస్యము రు 2-8-0, తెలుగు „హెవెన్సు అన్వొయిల్డు" అను అపూర్వజ్యోతిష గ్రంథరాజము రు 2 లు, „దినచర్య" అను హిందూదేశపు గొప్పజ్యోతిషగ్రంథం రు 1-8.0 లు, అద్భుతఫలప్రదర్శిని రు 1.0.0, పరలోకరహస్యములు రు 1-0-0, హాస్యరత్నావళి రు 0-8-0 లు, „బైరాగిచిటికెలు" అనువైద్యగ్రంథము యిందు అనేక పరమహంసక్రియలు, శుద్ధక్రియలు వైద్యరహస్యములు కలవు వెల రు 0-8-0 లు, హనుమంతశతకము యిందు సుందరాకాండ కథ అతిసులభశైలిని వ్రాయబడినది, రు 0-2-0 లు పైపుస్తకములన్నియు ఒకేసారికొనువారికిని, గళనునకు 12పుస్తకములు తెప్పించుకొనువారికిని, బుక్కుసెల్లర్సుకును స్పెషలుధరలు యివ్వబడును.

కళింగజ్యోతిషనిలయము, పోస్టుబాక్సు నెం 20 రు,

విజయనగరం, (విశాఖపట్నంజిల్లా).

---

# అపూర్వ జ్యోతిష గ్రంథరాజములు

ఈదిగువ నుదహరించిన మూడుపుస్తకములు చదివినవారు నిస్సందేహముగా జ్యోతిష్కులుకాగలరు. పుస్తకములుచాలసులభశైలిలో చక్కని తెలుగులో వ్రాయబడినవి. ఇట్టిపుస్తకములు ఎన్నడును యిదివరకు ప్రచురముకాలేదు. గురువు అక్కరలేకయే జ్యోతిష్కులగుటకు యీపుస్తకములే ఆధారమని నమ్మవలయును.



# జ్యోతిషరహస్యము.

(1) „జ్యోతిషరహస్యము":- ఈపుస్తకము చదివిన ప్రతివారును జ్యోతిషమును సులభముగా నేర్చుకొనగలరు. ఇందనేక గొప్ప జ్యోతిష్కులకైనను తెలియని రహస్యములు కలవు. యిది సుప్రసిద్ధ జ్యోతిష్కులని ఖ్యాతివహించిన ప్రొఫెసర్ ప్రకాశరావు గారిచే వ్రాయబడినది. దీనిని గురించి ప్రస్తుతము ఏలూరు సబ్ జెడ్జి మ॥ ఆతీ నారాయణ పంతులుగారిట్లు వ్రాసిరి. „జ్యోతిషమును నేర్చుకొనువారికి యీజ్యోతిషరహస్యమను గ్రంథము చాల యుపయోగకరము. సాధారణమైన చదువునేర్చిన స్త్రీలకుగూడ బోధపడునట్లు యీపుస్తకము వ్రాయబడినది" వెల 2-8-0 లు, పోస్టు ఖర్చులు కొనువారే భరించవలయును.

(2) „హెవెన్సుఅన్వొయిల్డు" అనుఅద్భుతజ్యోతిషగ్రంథము ఇది సర్వజనోపయుక్తమగు పుస్తకమాణిక్యము. ఇట్టి అపూర్వమైన జ్యోతిషగ్రంథరాజమును గురించి తే 23.7-21 దీగల ఆంధ్రపత్రిక యిట్లువ్రాయుచున్నది. „హెవెన్సు అన్వొయిల్డు" యియ్యది సర్వజనోపయుక్తమగు పుస్తకమాణిక్యము. ఇందలి ప్రతివిషయమును అమూల్యము. జ్యోతిష్కులమని ప్రజలవంచించు మాయావులకు పదులుపాతికలు సమర్పించి వారుచెప్పెడు కల్లమాటలునమ్మి మోసపోవువారికిది కల్పతరువు. ఇతరుల సహాయమేమియు నక్కరలేకయే జాతకము, జన్మనక్షత్రము, మున్నగువాటితో పని లేకుండ యేనెలకానెల కలుగగల భావిఫలములను యెవరికివారే కడుసులభముగ చూచుకొనవచ్చును. అట్లు ప్రతివిషయమును ప్రతివారికిని బాగుగ బోధపడునట్లు ఈగ్రంథరాజము అతిసులభమైన తెలుగులో వ్రాయబడినది. మరణకాలమును నిర్ణయించుట దీర్ఘజీవితమునకు చేయవలసినపనులు యిందు వివరింపబడెను. ఒకరి సహాయ మవసరము లేకుండ తెలియవలసిన విషయములన్నియు దీనియందు గలవనుట అతిశయోక్తి కాదు. పోస్టుఖర్చులగాక వెల రు 2 లు. మాత్రమే.

# అద్భుత భవిష్యత్ ఫలదర్శిని

అను ఆశ్చర్యకరమైన పుస్తకము.

ప్రతివారును చదివితీరవలసినది. ప్రతియింట నుండతగినది.

(3) ఈపుస్తకము ప్రతిమనుజునకును ప్రతిదినమును మిక్కిలి ఉపయోగకరము. తరతరములనుండి వచ్చుచున్న జ్యోతిష్కులయొక్కయు, యోగీశ్వరులయొక్కయు అనుభవజ్ఞానామృత సారముతో నిండియున్నది. అత్యుత్తమము సమయములందును, ఏదైన నొకకార్యము ఏమగునోయను నాందోళమున మనస్సుకొట్టుకొనుచున్నప్పుడును, ఇదియే సన్నిహితజ్యోతిష్కుడు. అనుమాన సహస్రముల నన్నిటిని క్లుప్తముగ తేటగ విప్పిచెప్పగలదు. ఈపుస్తకము ప్రతివారును చదివి తెలిసికొనునట్లు వ్రాయబడినది. ఈపుస్తకము చూచుకొనుటకు జాతకముగాని పుట్టినతేదీ నక్షత్రము మొదలగునవి యేమియును అవసరములేదు. ప్రతివారును యీపుస్తకమును చూచుకొనవచ్చును. ఈ "భవిష్యత్ ఫలదర్శిని" ముందుతోచిన జూపునింటి జ్యోతిష్కుడనుటకు నిస్సందేహము.

తరతరములనుండి వచ్చుచున్న జ్యోతిష్కుల యొక్కయు, యోగీశ్వరులయొక్కయు అనుభవజ్ఞానామృతసారముతో నిండియున్నది. దీనినిగురించి మైసూరు దేశములోచేరిన తమకూరుజిల్లా, డిస్ట్రిక్టు మేజస్ట్రేటుగారగు ఎ.యస్.సిర్సి.బి.ఎ.యల్. యల్.బి., గారిట్లు వ్రాసిరి. "ముందుగ నేమగునో తెలుసుకొన కోరువారికి భవిష్యత్ ఫలదర్శిని చాలయుపయోగకరమైనది". వెల రు 1-0-0 పోస్టుఖర్చులు కొనువారే భరించవలెను.

ఈ పైమూడుపుస్తకములనుగూర్చి అనేక వందలకొలది యోగ్యతాపత్రములు పొందబడినవిగాని గ్రంథవిస్తరభీతిచే యిందువ్రాయలేదు. ఈమూడుపుస్తకములు ఒకేసారికొనువారికి పోస్టుఖర్చులు సహా రు 4-0-0 లకే యివ్వబడును. పుస్తకములు వలయువారీ దిగువ చిరునామాకు వ్రాయవలెను:-శ్రీ కళింగ జ్యోతిషనిలయము, పోస్టుబాక్సు నెం 20, విజయనగరం, విశాఖపట్నంజిల్లా.

# బైరాగి చిటికెలు

పరమహంసక్రియలు. శుద్ధక్రియలు.

అమూల్యమైన

## వైద్యశాస్త్రము.

ఇట్టిది ముందెన్నడు ప్రచురింపబడలేదు.

ఈగ్రంథము లోకోపకారముకొరకు ప్రచురింపబడినది. ఈ గ్రంథమువలన అతిసులభముగసమస్తమయిన వ్యాధులను వైద్యుని సహాయము నక్కరలేకయే పోగొట్టుకొనవచ్చును. ఈగ్రంథము ప్రతియింటను తప్పకయుండతగినదని యొకసారి చదువువారలకే తెలియగలదు. ఈగ్రంథమునందు గొప్పమహాపురుషులును, పరమహంసలును దెల్పిన శుద్ధక్రియలు వ్రాయబడినవి. రోగములు మాన్పుకొనుటకు మిక్కిలి ద్రవ్యమును పోగొట్టుకొనకయే యెవరియింటవారు ఈగ్రంథముచేత సమస్తమైనవ్యాధులను మాన్పుకొనవచ్చును. ఇదియొకగ్రంథమున్న మరివైద్యుని అవసరములేదు. వెలసులభము, ఫలమధికమని గ్రంథము చదివినవెనుక మీకే తెలియగలదు. ఇట్టిగ్రంథరాజమును మీరు ఇదివరకెన్నడును చూచియుండరు. వేయేల? ఈగ్రంథరాజము సర్వజనోపయోగమని పొత్తముచదువువారలే బల్కెదరు. గాన గ్రంథమునకై త్వరపడుడు. తప్పకచదువుడు. ఇందలి పరమహంసక్రియలను చేసిసుఖింపుడు. ఈగ్రంథమునందు గలపద్యములు ఆబాలవృద్ధులకును, స్త్రీలకును బోధపడునట్లుగ సులభశైలిని వ్రాయబడినవి. పద్యశై[illegible]టకు కొన్నిపద్యములు యీక్రింద వ్రాయబడినవి.

ఆ॥వె॥ నల్లేరు యుప్పును బల్ రక్కసియునూటి
సమభాగములుగాను సరిగనూరి
మాత్రలుకట్టి యామాత్రలు సేవి
యుబ్బసరోగముల్ దిబ్బచేరు॥

ఆ॥వె॥ రాళ్లు లేనిమంచి రాసున్నమును
కొబ్బరినూనెతో గూర్చియుంచ

నూరువరాలాకు క్షీరముల్ పేయుచు
కలిపితరచు వ్రాయ గజ్జిపోవు।

ఆ।వె। పల్లును ముగ్గలు బల్లమురియాలును
సమభాగములుచేసి సరిగనూరి
మాత్రలుకట్టి యామాత్రలొక్కొక్కటి
బుగ్గనుంచుకొనిన దగ్గుపోవు॥

ఆ।వె। నేలతాడివేరు నేర్పుపఁగొని తెచ్చి
యావుపంచితమున నరగనూరి
కల్పితాగ్రినంత కఠినమసట్టునంటి
మూలవ్యాధులెల్ల మూలబడును॥

సీ। కరకకాయలమీఁద గలుగుబొబ్బరయును
పిప్పలిమూలంబు తిప్పతీగ
వాయువిడంగంబు లాయష్టిమధుకంబు
పన్నపిప్పలియు నచ్చుపసముద్ర
షాడవిత్తసంబులు బోడసరంబును
వాముటితుంగ ముస్తలువసయు
సమముగతూచి పొడిచేసి నంతతంబు
ప్రొద్దునసులేచి నేతితో ముద్దచేసి
కర్షమాత్రంబు భక్షింపగలిగెనేని
గడియకొక పద్యశతకంబు నునుపుటగుదే।

ఔరాగి ఓటికీలు ప్రతులు వి. పి. గా పంపబడును. ఒకప్రతి ఖర్చులుకాక రు 0-8-0. రెండుప్రతులు ఒకసారి తె మవారికి పోష్టుఖర్చులు వుచితము. మూడుప్రతులు ఒక్క చుకొనువారికి పోష్టుఖర్చులు వుచితమేకాకుండ ఒకప్రతి ఇవ్వబడును. ప్రతులువలయువారు యీదిగువ వలయును,

గ్రంథాలయము, పోష్టుబాక్సు 20,
విజయనగరం, [విశాఖపట్నం జిల్లా.]

# మహాభృగుసంహిత ననుసరించి జాతక ఫలములు అత్యద్భుతముగ చెప్పబడును.

ఈమహాభృగుసంహిత యొకగొప్ప జాతక గ్రంథము. ఇదిపూర్వకాలమున మహాఋషులచే వ్రాయబడినది. మన భరత ఖండమందుజన్మించిన ప్రతిమానవునియొక్క జాతకము, వానియొక్క జననము లగాయతు ఆయుర్దాయము ఆఖరువరకు జరుగుఫలితము లన్నియు ఆమూలాగ్రముగ సంస్కృతశ్లోక పూర్వకముగ నిందు అత్యద్భుతముగ వ్రాయబడినది. జన్మసంవత్సరము, పుట్టిన తేదీ జననకాలఘడియలు, లేక జాతకచక్రమున్న చాలును.

జాతకచక్రము భృగుసంహితనుండి వెదకుటకు రు 0-8-0, జాతకచక్రము లేనివారికి తయారుచేయుటకు రు 1-0-0, భృగుసంహితలోని శ్లోకములను తెలుగున అర్థము వ్రాయుటకు రు 2-0-0, వెరశి రు 3-8-0 అగును. జాతకచక్రమున్నవారికి రు 2-8-0 లు మాత్రమేయగును. ఇతరప్రదేశములలో నున్నవారి క్రింది చిరునామాకు వ్రాసిన ఫలములు వి. పి. గా పంపబడును.

ప్రొప్రయిటర్, కళింగ ఎష్ట్రాలాజికల్ బ్యూరో,
విజయనగరం, విశాఖపట్నంజిల్లా.

# హనుమంత శతకము.

అతిభక్తిరసముగాయుండును. సుందరాకాండకథ యావత్తును పండితులకు పామరులకు పారాయణకుపుపయోగించునట్లుగా సులభశైలిని పద్యములలో వ్రాయబడినది. శైలితెలుపుటకు రెండుపద్యములు యిందు వ్రాయబడినవి.

గీ॥ శ్రీలలిత ప్రకృతి కాయా • శ్రితవిధేయ।
జనకజామోద సంధాయ • సమగగేయ।
భవ్యకపిరాయ లక్ష్మణ ప్రాణదాయ।
అమలరామాంఘ్రి హృద్ధ్యేయ • ఆంజనేయ॥

సీ॥ విజయాభిరాముడై • వెలయునీహస్తంబు
రాక్షసేందులకు వ • జ్రంబుగాదె।
పదముల పవిత్రమై • వెలయునీమంత్రంబు
భవసాగరముదాట • ప్లవముగాదె।
సంతత నీకథా • శ్రవణంబుముక్తికి
బరువెత్తు సోపాన • పంక్తిగాదె।
మహనీయభవదీయ • మహిమ రామాయణ
మాలకనాయక • మణియుగాదె।
గీ॥ విజయనగరంబు లోపల • వెలయుచున్న।
కిల్బిషజనాంతధీమంత • కీర్తివంత।
దాంతసుస్వాంత రణరంగ • ధైర్యవంత।
అట్టినినునెంతు హనుమంత • యతికృతాంత॥

ఒకప్రతి వెల 0.2.0. మూడుప్రతులు ఒకసారి కొనువారికి ఒకప్రతియుచితము. ప్రతులుకోరువారు ఈదిగున చిరునామాకు వ్రాయవలెను. ఆంధ్రగ్రంథాలయము,
పోస్టుబాక్సు నెం 20, విజయనగరం.

*Very Beautiful!* *Very Humorous!!*

**Worth Reading.**

(అభినవ త్యాగరాజ కృతులు.)

## హాస్యరసరత్నావళి. (Comic Songs.)

ఈగ్రంథము అనేక కామిక్ ప్రొఫెసర్లవల్లను, హరిదాసులవల్లను, గానసభలలోను, మిక్కిలి ప్రసిద్ధిజెందియున్నది. ఈగ్రంథము



చదువుటచే ఆబాలవృద్ధులకు, స్త్రీలకును ప్రతియింటను సంతోషప్రదాయకమగు కాలక్షేపము జరుగును. ఇట్టిగ్రంథము యిదివరకెన్నడును చూచియుండరు. ఎవరును కనివిని యెరుగరు. దీనియందు నవరసములు నిండియుండును. వాటిలో హాస్యరసము - చదువుచున్నపుడు యెట్టివారికిని సమస్తవిచారములుపోయి కడుపుబ్బునట్లునవ్వుపుట్టక పోదు. త్వరలో గ్రంథమును దెప్పించుకొని చదివి గ్రహించిన మీకే బోధపడగలదు. వేయేల ? ఈగ్రంథరాజము ప్రతియింట నుండతగినది. ఇందలి పాటలు, పద్యములు, మొదలగునవి తేట తెనుంగున ప్రతివారికిని సులభముగ నర్థమగునట్లు వ్రాయబడినవి. కీర్తనలకు మీదను వరుసలు వ్రాయబడినవి. గ్రంథములు అయిపోవచ్చినవి గాన శీఘ్రముగా పుస్తకములకై త్వరపడుడు.

ఇందలి శైలిదెల్పుటకు యొకపద్యమును, కీర్తనయు, యీ దిగువ అచ్చువేయబడినవి:—

సీ॥ నారాయణాంశతో • ధారుణిపైవెల్గు
వైద్యుల మర్యాద • వన్నెతగ్గె।
ధన్వంతరి రోగులకు • తల్లి తనపిల్లలన్
చంపదలచిన నేమి • శాయగలము।
మొదట మందులఖర్చు • పిదప కట్నంబులున్
నడుమనడుమను బండ్లు • నడచుఖర్చు।
యిన్నిఖర్చులుబెట్టి • యెంతనమ్మినగాని
వ్యాధిపూర్ణముగాను • వదలనివరు।

గీ॥ మరియులేహములకు సా • మగ్రిజెప్పి।
వాటికై కొంతద్రవ్యము • వసలజేయు।
చావనివ్వరు బ్రతుకగ • లేవనివరు।
యిట్లకొందరు వైద్యులు • యిలనువెలసె॥

## పేకాటపాట.

(రంగ్ భంగకాలోటాయనువరుస'. రాగము — కాపీ — చతురశ్రగతి.

ప॥ ఈయాటలన్నిటిని మించిచెలంగెను యందమైన పేకాట।
పొరపాటుచేత నే లేటుచేసితిని సీటు దొరకదీపూట।

అ॥ అకటా। యిచటా। మరిమాటలాడగా జాల। నామనసు నిలువనీ
వేళ। వేగన్। ప్రవేశింపన్। ఇకన్ గెల్తున్। తమాషా। జూడు।
నేడు। వహ్వా॥ ఈ॥

చ॥ రమ్మైనయాట రన్మోరు। రక్షించి డబ్బురాగోరు। యిదిజూచు
వారు మరిపోరు। తప్పన్నవారు మరిలేరు। బ్లైండంచు నొక్కడొక
మారు। పదిరూకలువేసెతీరు। పొగడంగజాలరెవ్వారు। డ్రిప్పంచు
బల్కుచున్నారు। యెదుటాలసు కనిపెట్టేరు। ముడాసులుంట
జూచేరు। బేజార్। మరిన్ పలుమార్। చెకున్ యాఖిర్।
ఘూటా యీపేకాట॥ ఈ॥ ౧.

పదివందలు పోయిన వెనుక। మదిఫుట్టెను నాకతి కినుక। జూద
వ్యసనవృత్తిదిగనుక। మురుగుల్। రవల్ దుద్దుల్। బలేసరుకుల్।
తీసి। వేసి। ఆడి' యోడి॥ ఈ॥

ఆరోజున కట్టలయినాడు। మరునాడు తిరిగివచ్చేను। తనయింట
సొమ్ములోల్చేను। తాకట్టుపెట్టియాడేను। సర్వంబునోడిపోయేను।
మతిపోయివదిలిపోలేదు। దేశంబుల పాలయ్యేదు। సూరిదాసుం
డిడిబల్కేను। వదలన్। వలెన్। వేగన్। యీపేకాటన్। అనుభవ
మయ్యెన్। నాకున్। యిపుడుగా॥ ఈ॥

ఒకప్రతివెల రు 0-8-0 లు. 2, ప్రతులు ఒకసారికొన్న పోస్టు
ఖర్చులుచితము 5 ప్రతులు ఒకసారితెప్పించుకొనువారికి పోస్టుఖర్చు
లుచితిమేకాకుండ ఒకప్రతికూడ వుచితముగాయివ్వబడును.

వలయువారి క్రిందిచిరునామాకు వ్రాయుడు
మేనేజరు:— ఆంధ్రగ్రంథాలయము,
పోస్టుబాక్సు నెం 20, విజయనగరం, (విశాఖపట్నంజిల్లా).

## సకలార్థ [illegible]

ఇయ్యది యొక [illegible] యందను
యును యిదివరకు [illegible] యనేకసంగతులు
ప్రతినెల [illegible] శాస్త్రము, యోగవిద్య,
యోగమహిమ [illegible] ను గురించి విపులముగా
చర్చించబడును. ఆయుర్వేదము (Medicine and Hygeine Biology)
సాముద్రిక శాస్త్రము (Physiognomy and Phrenology), జ్యోతి
షము (Astrology) స్వరశాస్త్రము, అనగా కుడి యెడమ ముక్కు
రంధ్రములనుండి వెడలువాయువు సూర్య చంద్ర స్వరములను పేరు
[illegible] శుభాశుభములను, జరగబోవు లోకవ్యవహారములను,
[illegible] (ఆయుశ్శాస్త్రాయాదులు), తెలియజేయు అపూర్వశా
[illegible] శాస్త్రము [illegible] పరిమాణము. దీనినిగురించి ప్రతినెల
విపులముగా చర్చించబడును. మనోదశ్య శాస్త్రము (Mesmerism
and [illegible] otism), ఆధ్యాత్మిక శాస్త్రము (Psychic literature),
అనగా పరలోకవాసులయొక్క యిదివరకు కని విని యెరుగా
మాకర సంపాదిత మయిన అనేక సంగతులు యిందు ప్రచు
[illegible]. అద్వైతమతసంబంధమైన అనుభవములు, వేదాంతరహ
[illegible] యిది యది అననేల, మన హిందువులయొక్క అ
[illegible] న్నిటినిగురించి వీలగునంతమట్టుకు వెల్లడిచేయు
[illegible] యీమాసపత్రిక వెలువడ నున్నది గాన
[illegible] తను, నాగరికతను,
[illegible] సంగతి
[illegible] నను, దేశాభి సభివృద్ధిజేయ
[illegible] యున్నారలకును, దైవభ
[illegible] దీని సంకల్పిత పత్రికభాజమ
[illegible] మనవ

దృష్టిపరముగ సహాయముచేసి, యీపత్రికను పోషించెదరని మా ముఖ్యప్రార్థన. దీనియందు కేవలము లోకోపకారములగు ఉపయుక్తములగు విషయములనేకములు చక్కగా పండితులకును, పామరులకును బోధపడునట్లు జర్పింపబడును.

కేవలము మనపూర్వుల మహావిద్యల నన్నిటియొక్క ఉత్కృష్టతను వెల్లడిచేయు ముఖ్యోద్దేశముతోను, మన హిందూ మతరహస్యములే మనహిందువులకు ముఖ్యజీవనముగా ప్రబోధజేయు ముఖ్యోద్దేశముతోను, యీమాసపత్రికను, మన ఆంధ్రదేశమందున్న ప్రతి హిందువునికి చూచుభాగ్యము లభించునట్లు చేయుటకై దీనియొక్క సంవత్సరపు చందా రు 2-8-0 లు (Annual subscription) ప్రం చపమయినది గాన, యీపత్రికకు మన ఆంధ్రులందరు తోచినపుడి యెవరికి తోచిన ధనసహాయము వారుచేసి పత్రికయొక్క ముఖ్య పోషకులుగా ఉందురని మాధృఢనిశ్చయము ఈపత్రిక ... హిందూమతాభిమానమే జీవనముగా నుంచుకొన గోరుచున్న ... ఆయభీష్టమును మన ఆంధ్రులందరు నెరవేర్తురుగాక.

ఇటువంటి పత్రికలలో యియ్యది మొదటిది. ఇది ... మును వెల్లడను సుప్రసిద్ధ జ్యోతిష్కులని ప్రఖ్యాతి గాంచిన "రత్నభూషణ్, ప్రొఫెసర్ ప్రకాశరావు" గారి యాజమాన్యమున ద వెలువడుమన్నది. ఈమాసపత్రికలో వీరికిఅన్ని ... సుమారు ఇరువదియైదు సంవత్సరములనుండి ... అనుభవజ్ఞానామృతసారములు ప్రతినెల వెల్లడికావ్యాస ... ద్వారా కలుగ నుండగోరుచున్నాము.

... యాదిగువ చిరునా:

నా:— రు. 2–8 ... వు, ఎడిటర్.

న్ ప్రొఫెసర్ ప్ర... సం 20 రు.

... రము, పోస్టుబ్రాంఛిపట్నం ...

, విజయనగ...



# అత్యద్భుత రహస్యరత్నాకరము.

## యోగాభ్యాసమువలన జబ్బులను నివారించుకొను సాధనములు.

జబ్బులను పోగొట్టుకొనుటకును, ఆరోగ్యము స్థితిని బాగు చేసికొనుటకును సరియైనటువంటి వేళకు శ్రద్ధతో యోగాభ్యాసము చేయుట చాల శ్రేయస్కరము. ఈక్రింద పొందుపరచిన యోగాభ్యాస ఆసనములు అభ్యాసము చేసినయెడల మనస్సునకును శరీరమునకును శాంతి కలిగించుటయేగాక జబ్బులను విధిగా తొలగించును. ఈయోగాభ్యాస ఆసనముల అభ్యాసము చేయుటవల్ల ఇహసంబంధమైన పనులకు మిక్కిలి వుపయోగకరమేకాక పరవిషయమై చేయు ప్రయత్నములకు తోడ్పాటగును. బద్ధకము, అసంతృప్తి, సందేహాస్పదము మొదలగునవి పోగొట్టును. మనస్సును స్థిరముగ నుంచుకొను శక్తిని కలుగచేయును.

## "పశ్చిమతానమాసనము."



ఈ యాసనములో కాళ్లను భూమిపైని తిన్నగచాచి పాదములను కలుపవలెను. కాళ్ల బొటకనవ్రేళ్లను చేతియొక్క మొదటి 8 వ్రేళ్ళతో గట్టిగా పట్టుకొనవలెను. సిరస్సును సాధ్యమైనంతవరకు మోకాళ్ళదగ్గర నుంచవలెను. ఇట్లు చేయుటలో కాళ్ళు మాత్రము తిన్నగా కర్రవలె యుండవలెను. దీనిని "ఉగ్రాసనమ"ని కూడ అందురు. ఆసనాభ్యాసము ఆచరించుటవల్ల ఆకలిని అద్భుతముగా పుట్టించును. జఠరము తీక్షణముగా యుండును. అజీర్ణబాధలు పోవును. బొజ్జపెరిగినయెడల అదిపోయి సాధారణముగ నుండును ఆరోగ్యస్థితికూడ మిక్కిలి బాగుండును. జబ్బులున్నయెడల జబ్బులుపోయి నిరోగులగుదురు.

---

## "పద్మాసనము."



ఈ యాసనములో కుడిపాదమును యెడమతొడపైని, యెడమపాదమును కుడితొడపైని యుంచి, చేతులను వెనుకనుంచి, కుడి



పాదముయొక్క బొటకనవ్రేలును కుడిచేతితోను, యెడమ పాదముయొక్క బొటకనవ్రేలును యెడమచేతితోను పట్టుకొనవలెను. గడ్డమును చాతీమీద గుండెకు 4 అంగుళములు పైగానుంచి తనదృష్టి సంతటిని ముక్కుయొక్క చివరను నిలుపవలెను.

ఈసాధనము అన్నివిధములైన దీర్ఘపురాణజబ్బులను పోగొట్టి క్తనాళములను శుభ్రపరచి రక్తప్రవాహమును హెచ్చించును. శరీరారోగ్యము ఈఆసనాభ్యాసమువల్ల అద్భుతముగా వృద్ధియగును

---

జబ్బులను దూరప్రదేశములనుంచి బాగుచేయవచ్చును. ఎట్లనగా దూరదేశములో జబ్బుగానున్నవారికి మానసికవార్తలను లేక మనోసంకల్పములనుపంపుట, మంత్రించిన వుదకమును, పుష్పములను, పండ్లను మొదలగునవి బంపుట. ఇట్లు పంపుటకసాధ్యమైనప్పుడు సు స్త్రీగా నున్నవారు తెలసినవారైనయెడల వారితాలూకు రూపమునే తదేకధ్యానముతో తన మనస్సునందునిల్పి జబ్బుతప్పకుండా పోవునను మానసికసంకల్పమును పెక్కుసారులు ప్రతిదినము ధృఢపరచుచుండవలెను. ఇదివరకెన్నడును జబ్బుమనిషిని చూడనియెడల ఆజబ్బుమనిషితాలూకు ఫోటోగ్రాఫును తనయెదుటనుంచుకొని పై ప్రకారముగా మానసిక సంకల్పమును ధృఢపర్చవలెను.

ఏదెట్లున్నను రోగిని తెలిసియుండుట మంచిది. ఆరోగి మంత్రించువానియెడల నమ్మకముకూడ కలిగియుండవలెను. లేదా ఆరోగికి వీనిపైని నమ్మకము కలుగునటుల తగినసాధనములు చేయవలెను. ఇట్లు చేయుటవల్ల ఆరోగితాలూకు మనస్సుకూడను మంత్రవేత్తయందు కొంతవరకునిలచి మంత్రవేత్తచేయు సాధనములతోడ్పడి ఫలము శీఘ్రకాలములో కలుగును.

మనము రోగియొక్క రోగమును నివృత్తిచేయుటకై ప్రయత్నించుచున్నామను సంగతి రోగికి తెలియకపోయినను రోగియొక్క జబ్బుపోవును. ఇట్టి ప్రయత్నములలో రోగియొక్క ప్రయత్నము లేక కేవలము మంత్రవేత్తయొక్క ప్రయత్నమే యుండుటవల్ల జబ్బు నివారణయగుటకు కొంతకాలముపట్టును.

కాబట్టి దూరదేశమున రోగియున్నప్పుడు మంత్రవేత్తయొక్క మనస్సంకల్పమువల్ల రోగనివారణ చేయుట యెట్లనగా:—రోగికి ఉత్తరము మూలముగాగాని లేక ఒకమనిషిద్వారాగాని యీదిగువ వ్రాసిన్ని మాటలను తెలియపర్చవలెను. "నేను కులాసాగానున్నాను, నాశరీరారోగ్యము మంచిస్థితిలోనున్నది" అనిగాని లేదా ఒకదేవుని యొక్కపేరు "నారాయణ" అనుపేరునుగాని ప్రతిరోజును ఏదోఒక కాలము నిర్ణయించి ఆకాలమందే నిర్మలమైన మనస్సుతోను, నమ్మకముతోను, భక్తితోను ధ్యానించినయెడల రోగము తప్పకుండా నివారణ యగునని రోగికి తెలియపరచవలెను. అట్లు చేయుటవల్ల రోగి ప్రతిరోజును, నిర్ణయకాలమందు పైచెప్పినమాటలనుగాని, భగవంతుని నామమునుగాని, నిర్మలమైన మనస్సుతో జపించుచుండవలెను.

రోగికి నియమించిన కాలమునందే ప్రతిరోజును మంత్రవేత్తకూడను తనతాలూకు మనస్సంకల్పమును "రోగికి రోగము పోవలె"నని పెక్కుసారులు ధృఢపరచవలెను. రోగియున్న, మంత్రకారకుడున్న దూరముగాయున్నను ఒకేకాలమందు ఈ సాధనమును చేయుచుండుటచేత ఈమనస్సంకల్పము రోగికి బాగుగ పనిచేయును. ఇట్లుచేయుచు రోగియొక్క ఫోటోగ్రాఫుపైని గాని రోగియొక్క



రూపముపైనిగాని, మంత్రవేత్తయొక్క మనస్సంతయు నిలిపి "రోగికి జబ్బుపోవుచున్నది, రోగి ఆరోగ్యవంతుడైనాడు" పోయినది అను మనస్సంకల్పములను శ్రద్ధగాను, నిలకడగాను దృఢపర్చవలెను. ఇట్టి ఏర్పాటులవల్ల అనేకమైన కఠినజబ్బులను బాగుపడినవి. పైచెప్పిన ప్రక్రియలను సరిగా కొంచమైనను తప్పక దృఢనిశ్చయముతో చేసినయెడల ఫలములు తప్పక అనుకూలముగానుండును. ఈయభ్యాసము చేయువారు అనగా యిట్టిమంత్రవేత్త దైవభక్తిని మెండుగా కలిగియుండవలెను. దైవఆరాధనను తరుచుగా చేయువారే పైచెప్పిన రీతులచేత జబ్బులను కుదుర్చుటకు ప్రయత్నించవలెను.

దీర్ఘాయుర్దాయమును కలిగియుండుటకున్నూ శరీరారోగ్యమును కొరకున్నూ సాధనము ఊపిరి సాధారణముగా ముక్కుయొక్క రెండురంధ్రములలో ఒక రంధ్రముగుండా ప్రవహించును. ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా ఊపిరి ప్రవహించినయెడల సూర్యనాడి యనియు, ఊపిరి యెడమరంధ్రముగుండా ప్రవహించినయెడల చంద్రనాడియనియు అందురు. ఈరెండునుగాక సుషుమ్న నాడి యను యింకొక నాడికలదు. ముక్కుయొక్క రెండురంధ్రములగుండా నూపిరి ప్రవహించుచున్నప్పుడు సుషుమ్న నాడియనియందురు. ఊపిరి ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా ప్రవహించుచున్నప్పుడు అనగా సూర్యనాడి ప్రవహించుచున్నప్పుడీ క్రిందిపనులను చేయవలెను.

స్నానముచేయుట; భోజనముచేయుట; నిద్రించుట; సంభోగము; కసరత్తు; క్షౌరము; ఈత.

ఎవరైనను పైనిచెప్పినవన్నియును సూర్యనాడి ప్రవహించుచున్నప్పుడేచేయుచు, చంద్రనాడిగాని సుషుమ్ననాడిగాని ప్రవహించుచుండగా చేయక జాగ్రతగా నున్నయెడల అట్టివారు చాలాకాలము జీవించి తమజీవితకాలమంతయు ఆరోగ్యముగానుందురు.

---

# అద్భుతశక్తులను సంపాదించుటకు మార్గము.

ఎవరైనను అద్భుతశక్తులను సంపాదించవలెనని ఈక్రిందిరీతిగా చేయవలెను.

ప్రతిరోజును పగటివేళ నిర్జనప్రదేశమునకువెళ్ళి సూర్యుడు తనకు వెనుకప్రక్క నుండునట్లుగా అనగా తనతాలూకు క్రీనీడ తనకెదురుగా పడునట్లు నిలబడి తనతాలూకు క్రీనీడలోనున్న యెడమవైపు దృఢమైన మనస్సుతో 5 నిమిషములవరకు తదేకదృష్టితో చూచినయెడల తనక్రీనీడలోనున్న మెడ చీకటిగా కనుపించును. అప్పుడు ఆకాశమువైపు చూచుచు "హ్రీం పరబ్రహ్మణేనమః" అను మంత్రమును దృఢమైన మనస్సుతో 108 సార్లు జపించవలెను. ఈరీతిగా ప్రతిరోజును సరిగావేళకు శంకరుని తననిర్మలమైన మనస్సుతో దృఢనమ్మకముతో 6 నెలలు పైమంత్రమును వుచ్చరించుచు ధ్యానించినయెడల అట్టివారు శంకరుని చూడగలరు. అద్భుతశక్తికూడ పొందగలరు.

షరా:—చదువరులు పైనిచెప్పినసంగతి అబద్ధమని త్రోసివేయక దృఢమైన మనస్సుతో నమ్మవలెను. ఇది ఋషులవల్ల తెలియవచ్చిన రహస్యము కాబట్టి పైనిచెప్పిన రీతిగా అక్షరములా చేసినవారికి తప్పకుండా ఫలము కనపడును.



# పుట్టుమచ్చలు వాటితాలూకు ఫలములు.

---

నుదురుయొక్క కుడిభాగమందైనను లేక కుడికణతమీదనైనను పుట్టుమచ్చయున్నవారికి ధనముసంపద కలుగును.

కుడిచెయొక చివరను పుట్టుమచ్చయున్నవారికి నీటిగండము కలుగును.

కుడిచెవిమీదనైనను యెడమచెవిమీదనైనను పుట్టుమచ్చయున్నవారు ధనవంతులును మంచి గౌరవనీయులు నగుదురు.

కండ్లయొక్క యెడమకొలుకులయందు పుట్టుమచ్చకలవారు మానస్తాపముకలవారగుదురు.

కనుబొమ్మలపైని పుట్టుమచ్చకలవారికి వివాహము త్వరగా అగును.

ముక్కురంధ్రములయొక్కక్రిందను పుట్టుమచ్చయున్నవారు అదృష్టవంతులగుదురు. ముక్కుపైని పుట్టుమచ్చకలవారు చాల ప్రయాణములు చేయుదురు.

కుడిబుగ్గపైని పుట్టుమచ్చకలవారికి వయస్సు వచ్చునప్పటికి వివాహమగును.

గెడ్డముపైని పుట్టుమచ్చకలవారు గొప్పవారగుదురు.

పెదవులపైని పుట్టుమచ్చకలవారు తిండిపోతులగుదురు.

మెడపైని పుట్టుమచ్చకలవారు భాగ్యవంతురాలిని పెండ్లియాడుదురు లేదా వారివివాహమైన తరువాత గొప్పస్థితిలోనికి వచ్చెదరు. ఆడువారికి కూడనిదేపద్ధతి.

మెడపైని కుడిప్రక్కను పుట్టుమచ్చకలవారు చాల గొప్పవారగుదురు.

భుజముపైని పుట్టుమచ్చయున్నయెడల బాధను పొందుదురు.

ఎడమభుజముపైని పుట్టుమచ్చకలవారు జగడములాడుదురు.

కుడిచేతిపైనిగాని కుడిభుజముపైనిగాని పుట్టుమచ్చయున్నయెడల బుద్ధిమంతులును ముందాలోచన గలవారును అగుదురు.

సంకకును, గుండెలుకును దగ్గరగా పుట్టుమచ్చయున్నవారు ధనవంతులును గౌరవనీయులు నగుదురు.

చేతిమీద పుట్టుమచ్చకలవారు చాలా ఐశ్వర్యముకలిగి పిల్లలవల్ల సుఖమును సంతోషమును పొందుదురు.

పురుషులైనయెడల కుడిచేతికిని, స్త్రీలైనయెడల యెడమచేతికిని పుట్టుమచ్చయుండవలెను.

రొమ్ముపైని పుట్టుమచ్చకలవారు దరిద్రులగుదురు.

కుడిరొమ్ముమధ్యను పుట్టుమచ్చకలవారు మంచి తెలివితేటలు కలవారై కష్టపడి పనిచేయువారు నైయుందురు.

రొమ్మురొయొక్క యెడమభాగమునకు మీదనుపుట్టుమచ్చకల వారుదరిద్రమువల్ల బాధపడుదురు.

గుండెలుయొక్క యెడమభాగమందు పుట్టుమచ్చకలవారు దుర్మార్గులును మోటాగామాట్లాడువారు తొందరస్వభావముకలవారును అగుదురు.

కడుపుమీదను పుట్టుమచ్చలేక పుట్టుమచ్చలుకలవారు తిండిపోతులగుదురు.

కడుపుకు క్రిందిభాగమందు పుట్టుమచ్చకలవారు సాధారణముగ జబ్బులతో బాధపడుదురు.

కడుపుకు యెడమప్రక్కలో పుట్టుమచ్చకలవారు చాలసంతోషమును మితిమీరిన సౌఖ్యమును కోరుదురు.



కడుపుకు మధ్యభాగమందు పుట్టుమచ్చకలవారు ప్రాణమి క్కటమైన జబ్బుతో బాధపడుదురు.

కడుపుకు యెడమభాగమందు పుట్టుమచ్చ కలవారెల్లప్పుడును ఏదో బాధను పొందుచుందురు.

మొలమీదపుట్టుమచ్చకలవారు దరిద్రులగుదురు లేక దరిద్రముచే బాధపడుదురు.

ఎడమతొడమీదను మొలమీదను పుట్టుమచ్చలు కలవారు సుఖసంబంధమైన జబ్బులతో బాధపడుదురు.

కుడితొడపైనిగాని లేక అండత్రయములమీదనుగాని పుట్టుమచ్చకలవారు చాలధనమును కలిగియుందురు లేదా వివాహము మూలముగాగాని వివాహమైనతరువాతగాని గొప్పధనవంతులగుదురు. పురుషులైనయెడల కుడితొడయును స్త్రీలైనయెడల యెడమతొడయును లెక్కచూచుకొనవలయును.

మోకాలుపైని పుట్టుమచ్చకలవారు ధనముగలభార్యను పెండ్లియాడుదురు లేదా వివాహమూలముగా ధనవంతులగుదురు.

కుడిమోకాలుపైని పుట్టుమచ్చకలస్త్రీ సత్యవంతురాలును మంచినడవడియుకలిగి ప్రేమగలభర్తను కలిగియుందురు.

ఎడమ మోకాలుపై పుట్టుమచ్చకలస్త్రీ అనేకమంది పిల్లలను కలిగియుండును.

కుడిపాదముమీద పుట్టుమచ్చకలవారు తెలివైనవారును, మంచి వాచాలతయు గలవారైయుందురు.

కాళ్లగుత్తులమీదగాని, ఎడమపాదములమీదగాని పుట్టుమచ్చలుగల పురుషులు సిగ్గుగలవారును, స్త్రీల స్వభావమువంటి స్వభావమును కలవారునగుదురు.

కాళ్లగుత్తులమీదగాని పాదములమీదగాని పుట్టుమచ్చలుగల స్త్రీలు ధైర్యవంతులు పురుషస్వభావము కలవారునగుదురు.

పుట్టుమచ్చల ననుసరించి స్వాభావికఫలములను తెలిసికొను రీతి, శరీరమందనేక స్థలములయందుండు పుట్టుమచ్చల ననుసరించి వ్యక్తియొక్క స్వాభావిక ఫలములను తెలిసికొనవచ్చును. ఒకప్పుడు శరీరముమీద రెండుస్థలములయందు పుట్టుమచ్చ లున్నయెడల ఏభాగమందున్న పుట్టుమచ్చ ప్రాముఖ్యముగ నుండునో అనగా, పెద్దదిగాను దట్టముగానుండునో ఆట్టిభాగమునే లెక్కలోనికి తీసికొనవలెను.

ఒకవ్యక్తికి ముఖముమీదను, తొడలమీదను వీపుమీదను పుట్టుమచ్చ లున్నవనుకొందము, వీనిలో ప్రాముఖ్యముగనున్న పుట్టుమచ్చను చూచుకొనవలెను. అట్లుచూచుకొనినతరువాత ఏభాగమందు పుట్టుమచ్చ ప్రాముఖ్యముగనుండునో ఆభాగమునుబట్టి స్వాభావికఫలములను తెలిసికొనవలెను.

ఒకశరీరమును పరిశీలింపగా అనేకస్థలములయందు పుట్టుమచ్చలుండును. వీనిలో భుజముమీదను, వీపుమీదను యున్న పుట్టుమచ్చలు ప్రాముఖ్యముగ నున్నవి. కాబట్టి ఈతనితాలూకు స్వాభావికఫలములు ఈపుట్టుమచ్చలనుబట్టి మిశ్రముగనుండును.

సిరస్సునందుగాని, ముఖముమీదగాని పుట్టుమచ్చ కలవారీ క్రింద నుదహరించిన స్వాభావమును కలిగియుందురు. ఈభాగ



ములలో నెక్కడైనను పుట్టుమచ్చగల వ్యక్తి ప్రతివారితోను వైరము తెచ్చుకొనుచుండును. గర్వమును అతిశయమును గల్గిన స్వభావము గలిగియుండును, ఆశయను కోర్కెలును మిక్కిలి గలిగియుండును. అతడు ధనమును విస్తారము వ్యయపరచునట్టి స్వభావమును దయాళత్వమును గలిగియుండును; పైత్యాధికమును వాయుతత్వమును గలిగియుండును. విచారపీడితుడగును; సద్వర్తనుడై యుండును. ఇతరదేశములకు ప్రయాణము చేయును. ఆతడానందభోగములయం దాసక్తుడైయుండును. వికాశమైనట్టి స్వచ్ఛంద స్వభావము గలిగియుండును. చిత్రకళలుయుండును, కవిత్వమందభిరుచి గలిగియుండును. అతడుమిక్కిలి యాకస్మికముగు నిశ్చయమును, పట్టుదలయును విమర్శనాశక్తియును గలిగియుండును. స్వల్పబుద్ధిని వ్యక్తపరచు పనుల నాతడు యిష్టపడడు. ఆతడు చాల గౌరవమర్యాదలగల ప్రవర్తనను గలిగియుండును. ఆతడు కపటము లేకయుండును. ఆతడొకానొకప్పుడు నిరర్థకమగు కార్యములయందు బూనుకొనుచుండును. తానువ్యక్తపరచు తనభావాభిప్రాయములకును తనప్రవర్తనకును యసందర్భమగు విధమున విరుద్ధవర్తనుడైయుండును. అనగా చెప్పునదొకటియు చేయునదొకటియునైయుండును. ఆతనికిరాజకీయ సాంఘిక వ్యాపారములయం దభిలాషయుండును. ఆతడు జనయిష్టతను సంపాదించును.

,,మెడమీదను, లేక గొంతుగమీదను లేక చెవులమీదను పుట్టుమచ్చలు కలవారీక్రింద నుదహరించిన స్వభావమునుకలిగియుందురు.

ఈభాగములలో నెక్కడైనను పుట్టుమచ్చగలవ్యక్తి ఈవియందు బొహటమైన వాడైయుండును. ఓర్పుదారై యుండును

తలిదండ్రుల నలక్ష్యముచేయును. పనిపాటులయందు శ్రద్ధగలవాడై యుండును. ఆతడు హర్షమగు స్వభావమును, మనోహరమగు వస్తువులయందు ప్రీతియును, సౌఖ్యములయందు స్వేచ్ఛాభోగములయందు అభిలాషయును గలిగియుండును. ఆతడానందములయందభిలాషయును, సుభోజనప్రీతియు, స్వచ్ఛంద జీవనేచ్ఛయు కలిగియుండును. ఆతడుమిక్కిలి ద్రవ్యార్జనమును జేయును అతడప్పటప్పట ననుచితకార్యముల జేయును, ఆతడాభిజాత్యముగల స్వభావమునుగలవాడై, మిక్కిలి రోషముగలిగియుండును గొప్పవాగల యభిమానమును ఆతడు కలిగియుండును. ఆతడెల్లప్పుడున్నత సభార్యపై మిక్కిలి ప్రేమగలవాడై యుండును ఆతడు సంతోషమైనట్టియు, సంతృప్తత గలయట్టియు స్వభావమును గలిగియుండును. ఆతనికిమంచియోచనాశక్తియును దూరదృష్టియును గలిగియుండును. అతనికిగొప్పగ్రహింపుశక్తియుండును, ఆతడౌదార్యతయును గౌరవమును నార్జించును మరియుప్రజలవలన సదాదరణ, భావమున నెన్నబడును.

చేతులమీదగాని లేక భుజములమీదకాని పుట్టుమచ్చకలవారిక్రిందనుదహరించినస్వభావమును కలిగియుందురు. ఈభాగములలో నెక్కడైనను పుట్టుమచ్చకలవ్యక్తి అతివిస్తారమగుస్వవిశ్వాసము గలిగియుండును. ఆతడనేకవిధముల తనకుతానే శత్రుడగును. ఆతడు కనికరమును దయాళుత్వమునుగల స్వభావమును గలిగియుండును. తనయొక్క స్వశక్తివలన తానభివృద్ధిలోనికిరాగలుగు సామర్థ్యమును గలిగియుండును. ఆతడు మధురభాషణమును గలవాడై యుండును, ముందుకార్యమందు పూనికి గలిగియుండును. ఇట్టిదనిసరిగనిరూపింపవలవిగానిస్వభావమును గలిగియుండును. ఆతడు దయారసమగు



మనస్సును బుద్ధిబలమును గలిగియుండును. ఆతడు ప్రయాణములయందుప్రమాదములను ఆపదలనుబడును ఆతడు యాలోచనలేని ప్రవర్తనవలన ననారోగ్యముగలవాడై యుండును. ఆతడు మంచి కీర్తియును సహాయముచేయుచుండెడి బంధువులను గలిగియుండును. మరియుమంచి గుణములగలిగియుండును. ఆతడుమధుస్వభావరహితుడై పవిత్రతకలిగియుండును. మిక్కిలి యార్జనమును వెచ్చమును గూడచేయును, అనేకకార్యములయందు బూనుకొనచుత్సాహియై యుండును లాభకరమైనట్టియు విశ్వసనీయమైనట్టియు స్నేహములనాతడుచేయును.

రొమ్ములమీదను లేక కడుపుమీదను పుట్టుమచ్చ కలవారీస్వభావమును కలిగియుందురు. ఈభాగములలో నెచ్చటైనను, పుట్టుమచ్చగలవ్యక్తి కలసి కట్టుదనము గలట్టియు, ఉదారమైనట్టియు, దయగలట్టియు హితమగునట్టియు, స్వభావమును గలిగియుండును. అతడు చాలమంది స్నేహితులను గలిగియుండును. ఆతడానంద దాయకమగు వాటియెడలను తన్నుతాను, సొగసుగనలంకరించుకొనుటయందును నభిలాష గలిగియుండును. ఆతడేదియో యొకవిధమగు స్థిరమైన పద్ధతులను అనుకరణములనుగలిగియుండును. తనవారలనతడు నతిశయము గలిగియుండును. మరియునాతడు పిరికితనముగల స్వభావమును గలిగియుండును. ఆతడు మిక్కిలి విశ్వాసమును గలిగియుండును. ఆతడు కపవాత తత్వములనుగలిగియుండును. ఆతడు మంచియోచనాశక్తిగల బుద్ధినిగలిగియుండును. ఆతడు చదువుల నేర్చుటయందును ప్రయాణముల జేయుటయందును, మిక్కిలి యభిలాషగలవాడైయుండును. ఆతడుమంచితెల్లనైన శేఖరియగును. ఆతడుఆస్తినిసంపాదించును

ఆతడు జాగ్రత్తగల స్వభావమును గలిగియుండును. ఆతడు తనదగ్గర నున్నవారిని తగినంత శోధన లేకయే విశ్వసించును, మరియు నాతడ విశ్వసనీయులను నమ్ముట గూడసంభవించును,

చాతీమీదగాని, లేక వీపుమీదగాని పుట్టుమచ్చకలవారిక్రిందిస్వభావమును గలిగియుందురు. ఈభాగములలో పుట్టుమచ్చగలవారు వశీకృతము జేసికొనుటకు కష్టతరమైనట్టి బలవత్తరమైన దృఢస్వభావమును గలిగియుండును. ఆతడితరులయందపనమ్మకము గలిగియుండును. మరియుతనస్వశక్తియందు కూడవిశ్వాసము లోపించి యుండును. ఆతడు జాగ్రత్తమైనట్టియు నిఘాగలిగినట్టియు స్వభావమును గలిగియుండును. ఆతడు సదయమగు కరుణారస స్వభావమును, మనః పూర్వకమగు సానుభూతియును గలిగియుండును. ఆతడు పైత్యాధికమగు తత్వమును గలిగియుండును. ఆతడు ఖ్యాతిగల పురుషుడగును. అతడు దృఢమగువాడై శక్తిమంతుడైయుండును ఆతడు కపటములేనివాడై, నిర్మలత్వమును ఉదార స్వభావమును గలిగియుండును. ఆతడు కష్టపడి పాటుపడునట్టి యభ్యాసముల గలవాడై యుండును. ఆతడు నిర్మాణ శక్తియు, నొకదానితో నొకటిని పొందు గూర్చుశక్తి గలిగియుండును. ఆతడు శాంతియు సమ్మేళనమును అభిలషించువాడగును. ఆతడు విశ్వసనీయులగు ననేకులగు స్నేహితుల సంపాదించును. ఆతడు తనయాశయసిద్ధిని బడసిస్వచ్ఛందమగు మనశ్శాంతితో తనఔన్నత్య దినములను బుచ్చును. ఆతడు చాలమంది యనుచరులను గలిగియుండును. ఆతడు దృఢతరమగు మానసికయచలత్వమును మంచిమేధాశక్తియును గలిగియుండును.

కడుపు మీదగాని, పోచేయి (పోచీ) మీదగాని పుట్టుమచ్చలవారి క్రింద నుదహరించిన స్వభావమును కలిగియుందురు. ఈస్థల



ములలోను నెచ్చటనైనను పుట్టుమచ్చగలవ్యక్తి పనిపాటులయందు శ్రద్ధగల యభ్యాసములగలిగియుండును ఆతడు సంతోషమగు, యువకత్వము గలిగియుండును. ఆతడస్థిర స్వభావమును గలిగియుండును. ఆతడధిక ప్రసంగము చేయువాడుగాక ముక్తసరిగా మాటాడువాడై యుండును. ఆతని మనస్సు నిర్మలమై అకల్మషమై యుండును స్వభావము దయయు ఉదారతయు గలవాడై యుండును. ఆతడు జాగరూకుడును, ఉదాశీనము గలవాడును. సుకుమారియునై యుండును ఆతడు తన యన్నదమ్ములతోను అక్కచెల్లెండ్రతోను విరోధము గలిగియుండును. ఆతడు పనిపాటులయందు నేర్పరియై యుండును, ఆతడు సత్కార్యముల జేయుటకు నభిలాష కలిగియుండును. రహస్యమును గోప్యమును గలిగిన స్వభావ మాతడు గలిగియుండును, ఆతడు వేదాంతమునంద భిరుచి గలిగియుండును. ఆతడు బహువ్యాపకము గలవాడై యుండును. మరియు ననేకమగు వానియందు నేర్పులేక యభిరుచిగల స్వభావమును గలిగియుండును. ఆతడు తనయొక్క స్వశక్తివలనను అర్హతవలనను గౌరవమును, ఔన్నత్యమును బడయును. ఆతడు ఆస్తిని సంపాదించును. ఆతడు భోజన విషయమందును, ధరించు దుస్తుల విషయమందును, శ్రద్ధయు పట్టుదలయు గలిగియుండును.

„మొలమీదగాని బొడ్డుమీదగాని పుట్టుమచ్చకలవారిక్రింద నుదహరించిన స్వభావమును గలిగియుందురు." ఈస్థలములలో నెచ్చటైనను పుట్టుమచ్చ గలవ్యక్తి దయగల స్వభావము గలవాడై యుండును. స్త్రీలవలన సులభముగ వశుడగును ఆతడు ఖర్చువెచ్చములయందు మితత్వమును గలిగియుండు స్వభావముగలవాడగును ఆతడు సామాన్యమగు వ్యావహారికముల యందు

తెలివి తేటలుగల వాడైయుండును. ఆతడోరిమిలేని క్షణ, చిత్తమును
గలిగియుండును. ఆతడు దయగల యట్టియు హితమగునట్టియు
స్వభావమును గలిగియుండును. ఆతడు దూరాలోచన లేకయే
పనులను బూనుకొనుచుండును. ఆతడు చిరాకును గలస్వభావ
మును గలిగియుండును. ఆతడు ప్రయాణములు జేయుటకు నభి
లాష గలిగియుండును. ఆతడు పవిత్రతగలవాడైయుండును. ఆతడు
తనకుటుంభషులోని వారివలన గౌరవింపబడును. ఆతడు జాలి
గుండెగలవాడై మిక్కిలి దయయు సానుభూతియు గలవాడగును.
ఆతడానంద స్వభావుడైయుండును. ఆతడు స్వప్రియత్వమునకును,
స్త్రీలలాలనలకును లోనగువాడైయుండును. ఆతడు నిశ్చయమగు
మతాచారాదులయందు శ్రద్ధగలిగియుండును. ఆతడున్నత స్థితి
యందున్నవారల యాదరమును గలిగియుండును.

రహస్యభాగమందు పుట్టుమచ్చయున్న వారిక్రింద నుదహ
రించిన స్వభావమునుకలిగియుందురు. ఈభాగమందు పుట్టుమచ్చ
గలవ్యక్తియొక్క స్వభావము దృఢతరమైనదియు, బలమైనదియు,
శక్తివంతమగునట్టియు స్వభావమును గలిగియుండును. ఆతడు గర్వ
మును అతిశయమునుగల స్వభావముగలవాడగును. ఆతడు చాల
మంది శత్రువులను గలిగియుండును. ఆతడు విస్తారము ధనమును
ఖర్చుచేయును. ఆతడు పెద్దకుటుంబమును పోషించును. ఆతడు
తనబంధువులచే నావహ్యాంపబడును, ఆతడు పైత్యాధిక తత్వమును
గలిగియుండును. ఆతని అభిప్రాయములుం ఘనతరమైనవియును
ఉన్నతమైనవియు నైయుండును. ఆతనిభావములు బాహుళ్యమైనవి.
భవిష్యత్తు యేమగునోయని యనుమానింపక నాతడు ధైర్యవిశ్వా
సములతో నద్దానిని విలకింపుచుండును, మరియు నాతని యాశయ



ములు వ్యర్థముగావు, ఆతడు స్నేహితులను, తనను మెచ్చుకొను
వారలను సంపాదించుకొను నేర్పుగలవాడు. ఆతడు తృప్తిగలిగిన
అట్టియు, ఓపికతో పాటుపడునట్టియు మనస్సును గలిగియుండును. ఆత
డొరులను సమ్మతింపజేయగల సంభాషణాశక్తియును, ధైర్యమగు
స్వభావమును గలిగియుండును. ఆతనిమనస్సు దృఢమైనదియును,
స్థిరత్వముగలదియును, గ్రాహ్యతయు పట్టుదలగలదియును, బుద్ధికౌ
శలమును జూపదగు హంశములయందాశక్తి గలదియునైయుండును.

తొడలమీదగాని, పిఱ్ఱలమీదగాని పుట్టుమచ్చకలవారిక్రిం
ద నుదహరించిన స్వభావమును కలిగియుందురు. ఈభాగముల
లో నెచ్చటైనను పుట్టుమచ్చగలవ్యక్తి పనిపాటులయందు కౌశలము
గలిగియుండును. ఆతడు చాలామందిచే గౌరవింపబడును. ఆతడు
మంచితీర్మానమును, గంభీరహృదయమును, కుశాగ్రబుద్ధియును గల
వాడైయుండును. ఆతనిమనస్సు వేదాంతస్వభావము గలిగియుండును.
ఆతనికిమిక్కిలి యోర్మియు, శాంతతయునుండును. అతడనేక వ్య
పారములయందు నేర్పరియై, అన్నివిధములగు పనిపాటులయందును,
నిపుణుడైయుండును. ఆతడు యుక్తాయుక్తతలనారయుచు, జాగరూ
కతగలవాడైయుండు[illegible]కానొకప్పుడు మితభాషియై గుంభన
గలిగియుండును. ఆతడు [illegible]నను జాగరూకతతో యోచించి
చేయువాడైయుండును. ప్రకృతియందు శృంగారమైనవి యాతని
మనస్సును ఆకర్షించును. ఆతడుదయయును జాలియును గలస్వభా
వమును గలిగియుండును. ఇతరులస్నేహమును ఆతడుసులభముగసంపా
దించును. కాని యాతని యభిప్రాయములేమో యితరులు గ్రహింప
లేనంత గంభీరమనస్కుడైయుండును. ఆతడు స్నేహితులు సలహా
లను లెక్కింపక, తనయొక్క స్వప్రయత్నములయందె పూర్తిగవిశ్వా

సించును. అనేకయాటంకములు వచ్చినను ఆతడు తుదకు తానుద్యమించిన పర్యవసానముల బడయును.

మోకాళ్లమీదగాని, ముందొడలమీదగాని, పుట్టుమచ్చకల వారికిందిస్వభావమును కలిగియుందురు. ఈస్థలములయందెచ్చటైనను పుట్టుమచ్చగల వ్యక్తియొక్క స్వభావము మిక్కిలి శక్తిని వినియోగించుటకు నర్హమైనది. ఆతని విధానము గర్వమైనట్టిదియు, పెడసరమైనట్టిదియునై యుండును. ఆతని స్వభావమప్పటప్పట విషాదహృదయమును గలిగియుండును. తన యదృష్టమేమగునోయను భీతియాతనిని సదా బాధించుచుండును. ఆతని యభివృద్ధికై బంధువులు తోడ్పడుదురు. మరలవారే అభ్యంతరములగలుగ జేయుదురు ఆతడు మతభక్తిని విస్తారముగ కలిగియుండును. ఆతడుదయాదృష్టితో విచారింపకనే యేపనిలోనైనను చొరబడుచుండును. ఆతడు సమంజనమును యోచించునట్టి దూరదృష్టిగల బుద్ధినిగలిగియుండును ఆతడు వ్యావహారికములయందు ప్రసిద్ధుడై వృద్ధిగాంచును. ఎందునైనను యాతడు ఉన్నతస్థానమునకు జేరును. జీవితమునందాతడు తన స్వంత విధానములయందు పట్టుదలగలవాడై యుండును. ఏవృత్తి లేక వ్యాపారమునందాతడు పనిబూనినను, తనమనోబలమువలనను పూనికవలనను, ఇతరులు సాధింపజాలనివికూడ తాను నెరవేర్పగలుగును.

కాళ్లమీదగాని, కాళ్ళగుత్తులమీదగాని పుట్టుమచ్చకలవారికిందిస్వభావమునుకలిగియుందురు. ఈస్థలములయందెచ్చటైనను పుట్టుమచ్చగల వ్యక్తియుత్సాహమును, ఆనందమును, చిత్రకళలయందభిరుచియును, గలిగి దయగలస్వభావమును గలిగియుండును. ఆతడు తన్ననుసరించు స్నేహితులనేకులతో గూడియుండును. ఆతడు



యోచనగల శాంతమనస్కుడై యుండును. ఆతని మనస్సు వేదాంతసంబంధమగు పరిశ్రమలయందు దగిలియుండును. ఆతడు గొప్పమనోగాంభీర్యతయును, స్వతంత్రబుద్ధియును, యోచనయందు బాగుగ చొచ్చెడిమనస్సును గ్రాహ్యశక్తియును, గలవాడై యుండును. ఆతడు మంచి గీర్తినిబడయగలడు. ఆతడు దైవభక్తినిగలిగియుండును. ఆతడు తన విధానములయందు జాగరూకుడై యుండును. తనయాశయములయందున సున్నితాధర్మములగల కోర్కెపెంపుగలవాడై యుండును. ఆతడు విడువనిపట్టుదలయును ఆకస్మికముగ జనించిన దీక్షయును గలిగినవాడై యుండును. ఆతడు చురుకుదనమును ఓపికయును గలవాడై తన నియమితోద్యోగమునందభివృద్ధిగాంచును. ఆతడెట్టి కఠినమైనట్టియు యడతెగనట్టివియు కలుగు ఆటంకములైనను భేదించుకొని పోగలశక్తినిగలిగియుండును. ఆతడనేక హంశములయందు చొరగలగొప్ప యాశయములగల మనస్సును, మరియు నుపకారబుద్ధియు జాలిమతమును గలవాడై యుండును.

పాదములమీద పుట్టుమచ్చకలవారికిందిస్వభావమును కలిగియుందురు. పాదములమీదపుట్టుమచ్చగలవ్యక్తి చురుకుదనముగల యభ్యాసములను గలిగియుండును. పవిత్రకార్యముల జేయు నుద్యమమును గలిగియుండును. ఆతనికి లోలోపల విరోధముగలవారనేకులుందురు. ఆతడు విస్తారము మతాభిమానమును బడయుచుండును. ఆతడు విరోధములవలనను శత్రువులవలనను నష్టములనుబొందును. ఆతడప్పటప్పట పిరికిదనము గలిగియుండును. మఱల నంతలోనే తెగువగలవాడై యుండును. అతడు మిక్కిలి బలమగుకోర్కెలుగల స్వభావమును, తానుజేయుపనులపర్యవసానములను సరకుగొనని స్వభావమును గలిగియుండును. ఆతనికి గొప్పవారు స్నేహితులుందురు ఆతడు దయాళుత్వమును, అభిమానమును గలసామమగు

స్వభావమును గలిగియుండును. అతిథి సత్కారమును, ఆదరణయును, గలస్వభావము ఆతనికుండును. ఆతడు అసహాయులైనట్టియు, బంహీనులైనట్టియు, వారలకు గొప్పశరణ్యమై స్నేహితుడులేనిలోకముగ, వారల కందరకును రక్షణమైయుండును. ఆతడు తనకుసహాయముజేయువారలనేకుల గలిగియుండును. అతడుతనకు సహాకారులగు వారలనేకుల గలిగియుండును. మఱియు వారలాతనియొక్క నమ్మకమున బడయుగల్గుటయే భాగ్యమని భావింపగలరు, అతడుసౌఖ్యానందములయెడల మిక్కిలిప్రీతుడై యుండును.

## ఊపిరియొక్క అద్భుతమైనరహస్యములు, వాటిప్రయోగములు.

సాధారణముగా నూపిరెల్లప్పుడు నేదోయొక ముక్కురంధ్రమునుండియే వచ్చుచు పోవుచునుండును. ముక్కుయొక్క కుడిరంధ్రముద్వారా వచ్చు యూపిరికి సూర్యనాడి యనియు, ముక్కుయొక్క యెడమరంధ్రము ద్వారా వచ్చుయూపిరికి చంద్రనాడి యనియు నెరుంగవలయును. ఊపిరియొక్క సహాయముతో ఫలములను తెలిసికొనుటకీరెండు నాడులను జాగ్రతగా గుర్తింపవలయును. ఈరెండునాడులను జాగ్రతగా తెలిసికొనినపిదప ఆయుర్దాయమును గాని తదితరవిషయములగాని తెలిసికొనవచ్చును.

సుషుమ్న నాడియను యింకొకనాడి యున్నది. ముక్కురంధ్రములు రెంటిగుండా నొక్కసారే వచ్చుయూపిరికి సుషుమ్న నాడియనిపేరు.

ఈవిధముగ “ఇడ, పింగళ, సుషుమ్న,” యను మూడు నాడులుకలవు. ఈమూడు నాడులను కొంచముఅభ్యాసముతో పోల్చుకొనవచ్చును.



ఊపిరొకొక్కప్పుడు ముక్కురంధ్రముగుండా రెండేసి గంటలవరకువచ్చి రెండుగంటలైన తరువాత మరొక ముక్కు రంధ్రమునకు మారుచుండును. ప్రతిశుద్ధ పాడ్యమినాడు సూర్యోదయమునకు ముక్కుయొక్క యెడమ రంధ్రము గుండా యూపిరివచ్చి సూర్యోదయము మొదలు రెండుగంటల వరకారంధ్రము గుండా వచ్చి తరువాత ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా రెండు గంటలవరకు వచ్చుచుండును. ప్రతిబహుళపాడ్యమి నాడు సూర్యోదయమునకు ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా రెండుగంటలవరకు వచ్చిసూర్యోదయము మొదలు రెండుగంటలయిన తరువాత ముక్కుయొక్క యెడమరంధ్రము గుండా రెండు గంటలవరకు వచ్చుచుండును. ఇట్లే ప్రతిరెండేసి గంటలకొకసారి ముక్కుయొక్క యొకరంధ్రము నుండి మరొక రంధ్రములోనికి యూపిరిమారుచుండును.

## యౌవనవంతులగుటకు సాధనము.

పగటివేళయందు ముక్కుయొక్క యెడమరంధ్రముగుండా యూపిరివచ్చునట్లును, రాత్రులందు కుడిరంధ్రముగుండా యూపిరివచ్చునట్లును యేర్పాటుచేసినయెడల యౌవనవంతులగుదురు. ఈ యభ్యాసమును చేయువారు బ్రహ్మచర్యవ్రతమును జరపవలెను. లేనియెడల పైప్రకారము చేయుటకసాధ్యమగును. ఇట్లుపగలంతయు యెడమస్వాసయు, రాత్రింతయు కుడిస్వాసయు వచ్చునట్లు ఏర్పాటుచేసినయెడల శరీరముక్షీణింపకుండ యుండును. యోగీశ్వరులీప్రకారముగ యూపిరివచ్చుటకు పగలంతయు ఒక దండముపైతమ కుడిచంకనుంచి కుడిశ్వాసరాకుండచేయుదురు. రాత్రులందు దండముపై యెడమచంకనుంచి యెడమశ్వాసరాకుండ చేయుదురు. ఇట్లుచేయుటవలన యోగీశ్వరులు కాయసిద్ధినొందుదురు.

ఊపిరి రాకపోకలపద్ధతులను బట్టియు ఇతరసాధనములవలనను ఆరోగ్యముగనుండువిధము.

ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా యూపిరి వచ్చుచున్నప్పుడే యెప్పుడును భోజనముచేయవలెను. ఇట్లుజేసినయెడల అజీర్ణమువల్ల ఎన్నడును బాధపడరు. ఇదివరకు బాధపడుచున్నవారిట్లు కొంతకాలము తప్పకుండాచేసినయెడల అజీర్ణజబ్బు తప్పక పోవును.

ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా యూపిరివచ్చుచున్నప్పుడే దేహబాధతీర్చుకొనుము. ముక్కుయొక్క కుడిరంద్రముగుండా యూపిరివచ్చుచున్నప్పుడే నీళ్లనుత్రాగవలెను. ఈ రీతిగా ప్రతిరోజును చేయుచున్నయెడల ఆరోగ్యవంతులుగనుండి జబ్బులేమియు రాకుండనుండును. పైచెప్పిన సంగతియొక్క నిజానిజములను కనుగొనుటకు యెవరైనను పైప్రకారముచేయక దానికివ్యతిరేకముగ నొకవారమురోజులు చేసినయెడల అతిసులువుగ జబ్బుపాలగుదురు.

పైపద్ధతులప్రకారము అభ్యాసము తప్పక చేసినయెడల నూరు సంవత్సరములు జీవించి ఆరోగ్యముగనుందురు. ముక్కుయొక్క కుడిరంద్రముగుండా యూపిరివచ్చునప్పుడు భోజనముచేయుచు, తరువాత 100అడుగులు నడచి, యెడమవైపు ఒత్తిగిలిపడుకొని కుడిరంద్రముగుండా (అగ్నినాడి లేక సూర్యనాడియని కూడనందురు.) యూపిరివచ్చునటుల చేయువారు యెప్పటికిని అజీర్ణము వగైరా జబ్బులవల్ల బాధపడరు. ఈపద్ధతిని యక్షరముల చేయుచున్నయెడల ప్రమాదమైనటువంటి అజీర్ణజబ్బులుకూడ పోవును.

ముక్కుయొక్క కుడిరంధ్రము గుండా యూపిరివచ్చునప్పుడు భోజనము వగైరాలు చేసినయెడల జీర్ణశక్తిహెచ్చును గనుక యెవరైనను, అజీర్ణము వల్లగాని, కలరా వల్లగాని విరోచనముల వల్ల



గాని బాధపడుచున్న రోగులకు యెప్పుడును యెడమ రంధ్రముగుండే యూపిరాడుచుండును కాబట్టి అట్టియూపిరినికట్టి వైద్యసాధనముచేగాని లేక మరేసాధనము చేతనైనను కుడిరంధ్రము గుండా యూపిరివచ్చునటుల చేయవలయును ఇట్లుచేస్తేనేతప్ప లేనియెడల రోగముకుదరదు.

రెండుసాధనములవలన జబ్బులను నివారణచేయుట:—

అమృతధారా ధ్యానం:— ప్రతిరోజును సరియైనవేళకు రోగి తనయిష్టదేవతను ప్రొద్దుటవేళ ఒకగంటయును, సాయింత్రమొకగంటయును యేకాంతస్థలముకుగాని దేవాలయమునకుగాని వెళ్ళి ప్రార్థనచేయవలెను. రోగికి మిక్కిలినమ్మకమున్న యేదేవునైనను తనపాపములన్నియు పోవలయుననియు తనయిష్టదైవముయొక్క కమండలములనుంచి అమృతము తనలోనికి ప్రవహించుచున్నట్లును అందువలన తనజబ్బుపోవుచున్నట్లును భావనచేయవలెను. అట్లుచేయుటవలన రోగముపోయి మంచిసత్తువనిచ్చి శరీరమారోగ్యముగనుండును. ఎవరైన నీసాధనము ప్రతిరోజును సరియైనవేళకు కొన్నివారములవరకు చేసినయెడల యెట్టిదీర్ఘజబ్బులుగాని కట్టిజబ్బులుగాని అతిఆశ్చర్యకరముగపోవును.

ఎవరైనను, ఉష్ణముచేతగాని, ఉబ్బనవల్లగాని, కఠినమైన నొప్పులచేతగాని, విరేచనములతోగాని, అజీర్ణముచేతగాని బాధపడుచున్నయెడల ఆసమయమునకు ముక్కుయొక్క యేరంద్రముగుండా నాడిప[illegible]ంచుచున్నదో కనుగొని ఆనాడిని నిలిపివేసి రెండవరంద్రముగుం[illegible] ప్రవహించునటుల చేయవలెను. ఇట్లుచేయగల్గిన యెడల బాధ వెంటనేనివారణకాకపోయినను కొంచము బాధనివారణమగును. కడుపునొప్పులు, ఉబ్బసలు ఈసాధనములవల్ల వెంటనే

పోవును. ముక్కుయొక్క ఒకరంధ్రముగుండా యూపిరి వచ్చుచున్నయెడల రెండవ రంధ్రముగుండా వచ్చుటకుగాను యూపిరివచ్చుచున్నవైపు తిరిగిపండుకొనవలెను, లేదా యూపిరివచ్చుచున్నముక్కురంధ్రములో సుభ్రమైన పాతదూదినిపెట్టుకొనవలెను.

## నిద్రపోవుచుండగా కలలో యేదైననొక ప్రశ్నకు జవాబును కనుగొనుట

రాత్రియందు పండుకొనునపుడు మంచమునకు 3లేక 9అంగుగులలో ఒక దీపమునుంచుకొనవలెను. మంచముమీద పండుకొనని యెడల పండుకొనిన వాని తాలూకు క్రీనీడ యొక్క గోడమీద పడునట్లు దీపము నుంచవలెను. మంచముపైని పండుకొని తన తాలూకు క్రీనీడను చూచుచు తనయిష్ట దేవతను దృఢమైనటువంటిన్ని నమ్మకమైనటువంటిన్ని మనస్సుతో స్మరించును తనకు తన యిష్ట దేవతకు బేధములేదను కొనుచు తానుయిష్ట దేవతయేయని నమ్ముచుతన ప్రశ్నకు జవాబు ఆరాత్రి తన కలలో రావలెనని తలంచుకొనుచు తనమనస్సు నేవత్తును గోడమీద పడిన తన క్రీనీడపై నిలుపవలెను. పైచెప్పిన ప్రకారము అక్షరములా చేసినయెడల తన ప్రశ్నకు కలలో ఆరాత్రి నిశ్చయముగ జవాబువచ్చును. ఈప్రకారముగా చేసినయెడల ఆరాత్రియందు ప్రశ్నకుజవాబు రానియెడలవరుసగా కొన్ని రాత్రుల యందు ప్రయత్నించిన యెడల నేదో యొక రాత్రికలలో ప్రశ్నకు జవాబు నిశ్చయముగ వచ్చును. పైని చెప్పిన రీతిగా ప్రయత్నించు చున్నప్పుడు తనచుట్టు ప్రక్కల నిశ్శబ్ధముగనుండవలెను.

## ఏపనియైనను జయమగుటకు రహస్యము



సుక్ల పక్షమందు సోమవారమునాడు, బుధవారమునాడు, లక్ష్మీవారమునాడు, శుక్రవారమునాడు, చంద్రనాడి నడచుచున్నప్పుడీదిగువ నుదహరించిన పనులను ప్రారంభించిన తప్పక ఆపనులు జయప్రదమగును.

చంద్రనాడి నడచుచున్నప్పుడు చేయవలసినపనులు:—

ఇల్లు కట్టుట, నూతులుత్రవ్వుట, తోటలువేయుట, దూరప్రయాణము, నూతన గృహప్రవేశము, వివాహములచేయుట, కావలసిన పనిమీద పెద్దవుద్యోగస్తులను దర్శించుట, విత్తులుజల్లుట, స్నేహితులనుచూచుట, గుఱ్ఱములను, ఏనుగులనుకొనుట, లోకోపకారార్థమై కొన్నిమంచి పనులను చేయుటకు ప్రారంభించుట, పట్టణములయందును, పల్లెలయందును, నివసించుటకు పోవుట, క్రొత్తవస్తువులనువాడుట, విద్యారంభము, క్రొత్తవస్తువులను సంపాదించుట, బంధువులనుచూచుట, పాడుట, గానము నేర్చుకొనుట, వర్తకవిషయమై సొమ్మును వసూలుచేయుట, తీర్థయాత్రలకు వెడలుట—

కృష్ణ పక్షమందు ఆదివారమునాడు, మంగళవారమునాడు, శనివారమునాడు, సూర్యనాడి నడచుచున్నప్పుడు ఈదిగువ నుదహరించిన పనులను ప్రారంభించిన అట్టిపనులు తప్పకుండ జయప్రదమగును.

సూర్యనాడి నడచు చున్నప్పుడు చేయువలసినపనులు:—

సముద్రయానము, వేట, కొండలు కోటలు యెక్కుట,

గుఱ్ఱములపైని, లొట్టెలపైని ప్రయాణముచేయుట, వ్రాతపని చేయుట, చిత్తరవులవ్రాయుట, యుద్ధముచేయుట, రాజులను, చక్రవర్తులను దర్శించుట, చతుష్పాద జంతువులనమ్ముట, వైద్యము చేయుట, పెద్దరాళ్ళను పగులగొట్టుట, వజ్రములను కోయుట లేక చెక్కుట—

ఏదేనియొక పనినిమిత్తము వెళ్లునప్పుడు యేనాడి నడచుచున్నదో చూచుకొనవలెను, సూర్యనాడి నడచుచున్నప్పుడు యేపని నిమిత్తమైనను వెళ్లుచున్నప్పుడు కుడికాలును గుమ్మమునకు ముందు వేయవలెను, చంద్రనాడి నడచుచున్నప్పుడు, యేపనినిమిత్తమైనను వెళ్లుచున్నప్పుడు యెడమకాలును గుమ్మమునకు ముందు వేయవలెను.

ఈపద్ధతుల ననుసరించి యేపనినిమిత్తమైనను బయలుదేరి వెళ్లినయెడల అట్టిపని జయప్రదమగును.

పరా:—చంద్రనాడి ప్రవహించుచున్నప్పుడు, తూర్పు దిక్కునకుగాని, ఉత్తరదిక్కునకుగాని, వెళ్లకూడదు. సూర్యనాడి ప్రవహించుచున్నప్పుడు దక్షిణదిక్కునకుగాని పశ్చిమదిక్కునకుగాని వెళ్లకూడదు.

ఇతరుల దయను సంపాదించుటకుగాని మంచికార్యముల జయమును బడయుటకుగాని చంద్రనాడి ప్రవహించునపుడు బయలు దేరవలెను. సూర్యనాడి ప్రవహించుచున్నపుడు, జూదము, వేట, మొదలగు దుర్వ్యసనములను చేయుటకు బయలుదేరవలెను.

ఈక్రింద నుదహరించినరీతిగా నీమనస్సులో ననుకొనవలెను:—

(1) "నేను చేయుకార్యములు తప్పకుండ జయప్రదమగును. నేను చేయుకార్యములెప్పుడు జయప్రదముతో కూడియుండును. నేనేజయప్రదమును."

(2) జయమును నమ్ముము, జయమునే యాలోచింపుము, జయమునే ధృఢపరచుము, జయముకలుగునని యనుకొనుము, నీవుచేయుకార్యములు తప్పక జయమును పొందును.



# ప్రశ్నలను భావిఫలములను అత్యద్భుతముగ దాఖలాతో జెప్పుట.

(1) మనము ఊపిరి పైకివదులునపుడు ఎవరైన నొకప్రశ్న మనలను వేశినయెడల ఆప్రశ్నకు జబాబు వ్యతిరేకముగ చెప్పవలయును అనగా ప్రశ్న యెందునిమిత్తమో ఆపని అపజయమగును.

మనము ఊపిరి లోపలికి పీల్చునపుడు ఎవరైన నొకప్రశ్న మనలను వేసినయెడల ఆప్రశ్నకు జబాబు అనుకూలముగ చెప్పవలయును అనగా ప్రశ్న యెందునిమిత్తమో ఆపని జయమగును.

(2) ఎవరైన నొకప్రశ్న వేశిన వెంటనే ఆప్రశ్నలోగల యక్షరములను లెఖించగా ఆయక్షరములసంఖ్య, సరిసంఖ్యయై నీకు (అనగా ప్రశ్నింపబడినవారికి) చంద్రనాడి ప్రవహించుచున్నయెడల ప్రశ్నకు జబాబు జయమని చెప్పవలయును, ప్రశ్నాక్షరముల సంఖ్య బేసి సంఖ్యయై[illegible], (అనగా ప్రశ్నింపబడినవారికి) సూర్యనాడి ప్రవహించుచున్నయెడల ప్రశ్నకుజబాబు జయమని చెప్పవలెను, ఇట్లుగాక అక్షరములసంఖ్య సరియై సూర్యనాడి ప్రవహించుచున్నను లేక అక్షరములసంఖ్య బేసియై చంద్రనాడి ప్రవహించుచున్నను, ప్రశ్నకుజబాబు అపజయమై చెడుఫలముల గలుగును.

(3) ప్రశ్న వేయువారు నీకు (ప్రశ్నింప బడినవానికి) యెడమప్రక్కనుండి నీకు చంద్రనాడి ప్రవహించుచున్నప్పుడు ప్రశ్న వేసిన అట్టిప్రశ్నకు జబాబు జయమని చెప్పవలెను, ప్రశ్న వేయువారు ప్రశ్నింపబడినవానికి కుడిప్రక్కనుండి నీకు సూర్యనాడి ప్రవహించుచున్నప్పుడు ప్రశ్న వేసినయెడల ఆప్రశ్నకు జబాబు అనుకూలముగ నుండును అనగా ప్రశ్నయొక్క ఫలము ప్రశ్న వేయువారి కనుకూలముగ నుండును, ఇట్లుగాక ప్రశ్న వేయువారు ప్రశ్నింపబడినవారికి కుడిప్రక్కనుండి చంద్రనాడి ప్రవహించుచున్నప్పుడుగాని లేక యెడమప్రక్కనుండి ప్రవహించుచున్నప్పుడుగాని ప్రశ్న వేసినయెడల అట్టిప్రశ్నకు అపజయమగును.

## శిశుజననవిషయమై ప్రశ్నకు జబాబు చెప్పువిధము.

ఒకగర్భిణీస్త్రీ మొగపిల్లవానిని కనునా లేక ఆడుపిల్లను కనునా అను ప్రశ్న వేసినప్పుడు ప్రశ్నింపబడినవానికిని ప్రశ్నించువానికిని కూడ సూర్యనాడి ప్రవహించుచున్నయెడల గర్భిణీస్త్రీ పూర్ణాయుర్దాయముగల కుమారుని కనును, ప్రశ్నింప బడినవానికిని, ప్రశ్నించువానికినికూడ చంద్రనాడి ప్రవహించుచున్నయెడల పూర్ణాయుర్దాయముగల కుమార్తెను కనును. ప్రశ్నించువానికి చంద్రనాడి ప్రవహించుచు ప్రశ్నింపబడినవానికి సూర్యనాడి ప్రవహించుచున్నయెడల గర్భిణీస్త్రీ అల్పాయుర్దాయముగల కుమారుని కనునని తెలుసుకొనవలెను ప్రశ్నించు వానికి సూర్యనాడి ప్రవహించుచు, ప్రశ్నింపబడినవానికి చంద్రనాడి ప్రవహించుచున్నయెడల గర్భవతి అల్పాయుర్దాయము గల ఆడుపిల్లను కనును, పైప్రశ్న వేయువ ఫలము, ప్రశ్నింప బడినవానికి సుషుమ్ననాడి ప్రవహించు చున్నయె



డల మరేమియు నాలోచింపక అనగా ప్రశ్నించువానికే నాడి ప్రవహించుచున్నదో చూచుటకవసరము లేకయే చనిపోవునట్టిపిల్లను గర్భవతికనును, గర్భముపోవును. లేక నపుంసకుని కనునని వెంటనే చెప్పవలయును.

ఒకగర్భవతి యేపిల్లను కనునో యనుప్రశ్న నీకు వేసినయెడల ప్రశ్నించువారు నీకు యేప్రక్కనుండి ప్రశ్నించుచున్నారో గుర్తించవలెను ప్రశ్నించువారు నీకు చంద్రనాడి ప్రవహించుచున్నప్పుడు యెడమప్రక్కనుండి ప్రశ్నించినయెడల గర్భవతి కుమార్తెను కనునని చెప్పవలెను.

నీకు సూర్యనాడి ప్రవహించుచున్నప్పుడు నీకు కుడిప్రక్కనుండి ప్రశ్నించినయెడల గర్భవతి కుమారుని కనునని చెప్పవలెను:-

పైనిచెప్పినవన్నియు నెవరివల్ల కావలనో అట్టివారిని, ఊపిరి ముక్కుయొక్క యేరంధ్రముగుండా వచ్చుచున్నదో. ఆవైపుననిలుబడి యుండునటుల చూడవలయును, అనగా యెవరిదయ సంపాదింపవలెనని కోరికగలదో వారిని నీకు చంద్రనాడి ప్రవహించున్నప్పుడు నీయెడమప్రక్కనుండునటుల యేర్పాటుచేసి వారితో సంభాషించినయెడల తప్పక నీకోరిక నెరవేరును, సూర్యనాడి ప్రవహించుచున్నయెడల వారిని నీకుడిప్రక్కనుండునటుల యేర్పాటుచేసినయెడల నీకోరికె తప్పక యీడేరును.

షరా:—ఇతరులదయను సంపాదించుటకై బయలుదేరునపుడు ముక్కుయొక్క యేరంధ్రముగుండా యూపిరాడుచున్నదో ఆవైపునున్న కాలును ముందు వేయవలెను, అనగా సూర్యనాడి ప్రవహించుచున్నపుడు కుడికాలును, చంద్రనాడి ప్రవహించుచున్న

పుడు యెడమకాలును, బయలుదేరునపుడు ముందువేయవలెను, ఇతరులదయను సంపాదించుటకై వెడలునపుడు చంద్రనాడి ప్రవహించు చుండగా బయలుదేరుట శ్రేయస్కరము.

ఇతరులదయను సంపాదించుటకై సూర్యనాడి యాడుచున్నపుడుకూడను బయలుదేరవచ్చును. కాని బయలుదేరునపుడు కుడికాలును ముందువేయవలెను, ఎవరిదయను సంపాదించవలెనో వారిని తనయొక్క కుడిప్రక్క నుండునటులచేసి మాట్లాడవలెను.

ఇతరులదయను సంపాదించుటకై సూర్యనాడి ప్రవహించుచుండగా వెడలుట మధ్యమము.

కాబట్టి ఇతరులదయను సంపాదించుటకై చంద్రనాడి ప్రవహించు చుండగా బయలుదేరుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నింపవలెను

## జబ్బుగానున్నవారి విషయమై ప్రశ్న

ఎవరైనను ఒకరోగియొక్క ఖాయిలా విషయమై యెట్లుండునో అనగా జబ్బునిమ్మళించునా లేదా యను ప్రశ్న వేసిన యెడల ప్రశ్న వేయువారు నీకు (ప్రశ్నింపబడినవారికి) యేప్రక్కను నిలువబడియున్నారో చూచుకొనవలెను. ప్రశ్న వేయువారు నీకు యేప్రక్కనుండి యూపిరివచ్చుచున్నదో యాప్రక్కను నిలచినయెడల రోగియొక్క జబ్బు పోవునని చెప్పవలెను. నీవు యూపిరిలోపలకు పీల్చుచున్నపుడు ప్రశ్నించినయెడల జబ్బుపోవునని చెప్పవలెను. ఊపిరి పైకివదలునపుడు ప్రశ్నించినయెడల జబ్బుకుదురుట సంశయము, నిరాశ. ప్రశ్నించువారు నీకు యూపిరాడని వైపునుండి ప్రశ్నించిన యెడల్ల రోగియొక్క జబ్బు అతికష్టము మీద కుదురునుము.



ప్రశ్నించువారు, నీకు సుషుమ్నానాడి యాడుచున్నప్పుడు ప్రశ్నించినయెడల జబ్బుగానున్న రోగి శీఘ్రముగా చచ్చునని చెప్పవలెను.

"సిరిసంపద భాగ్యము, మంచిఅదృష్టము జయము కలుగుటకు యీక్రింది పద్ధతులను జ్ఞాపకముంచుకొని వానికనుగుణ్యముగ నడచుకొనవలెను":—

గృహమందు కలహములేమియు నుండకూడదు.

ఇతరుల మనస్సులను నొప్పించకూడదు.

చాలకాలము స్నానమును చేయవలెను; తక్కువకాలములో భోజనమును ముగించవలెను.

లాభించిన అనగా ఒకరిచ్చిన పుష్పములను వాసనచూడకూడదు. వస్త్రములను ధరించని స్త్రీని చూడకూడదు.

శరీరమును శుభ్రముగ నుంచుకొనవలెను. సత్యమును తప్పకూడదు. ఇతరులకుపకారము చేయువలెను

అదృష్టదేవత యీక్రిందినుదహరించిన వాటియందు నివశించును కాబట్టి ఈవస్తువులను అతితరచుగా గృహమందు వాడుకచేయవలెను:—(అమలకము,) ఆవుపేడ, శంఖము (దీనిని సాయంకాలము వాడుకచేయవలెను.) కమలము, తెల్లనివస్త్రము.

ఈక్రిందనుదహరించిన వానిని అతిజాగ్రత్తగా దూరమునుండియే తొలిగించవలెను:— వాడిన పుష్పములు, స్మశానమునుంచి తెచ్చిన బొగ్గులుగాని ఎముకలుగాని (రాత్రియందుంచిన పుష్పములు) దుర్వాసన, విరిగిపోయిన బల్లలు కుర్చీలు మంచములు

గొడుగులు మొదలైనవి చింకిజోళ్ళు అందవికారమైనస్త్రీలను, చాలమందితో తరచుగా తిరుగుట మొదలైనవి.

బ్రాహ్మణుని, గోవును, నిప్పును, బూడిద, ఊకను, తన కంటెపెద్దవానిని, (బంధువులను) పాదముతో తాకకూడదు. పాదముల నొకదానితో నొకదానిని రాయకూడదు.

అదృష్టవంతులుగ నుండగోరువారు గోళ్ళుగాని, తలవెండ్రుకలుగాని పడిననీళ్ళను ముట్టుకొనకూడదు. త్రాగకూడదు.

పండుగరోజులయందు, సాయంకాలము యందును సంభోగమును చేయకూడదు. మిఠాయి మొదలగు తీయని పదార్థములను తినుటకుపూర్వము ఇతరులకు కూడ కొంతభాగమియ్యకుండ తినకూడదు.

ఒక పుష్పమును శిరస్సునందుంచు కొనవలెను. పాదములను శిరస్సు నెప్పుడును శుభ్రముగనుంచు కొనవలెను.

తుడుచుటవలన కలిగిన ధూళిలో యెంత మాత్రముండ కూడదు. మారడిపండ్లను, పెరుగును రాత్రులందు భుజించకూడదు.

ఎవరైనను పాడుచుండగా తనశరీరముపైని గాని తాను కూర్చొనిన ఆసనముపైనిగాని తాళమును లేక దరువును వేయకూడదు. స్నానముచేసిన తరువాత తలకునూనెను వ్రాయకూడదు.

సిరినికోరువారు చీకటి గదులలో పండుకొనగూడదు. రాత్రి ధరించినదుస్తులను ఉదయముననే మార్చివేయవలెను. మాసిన బట్టలను చినిగినబట్టలను ధరించగూడదు, చింకిజోళ్ళను, విరిగిపోయిన గొడుగులను వాడుకచేయుటమానివేయవలెను



# యోగాభ్యాసమువల్ల కోరికలన్నియు నెరవేర్చుకొను విధము.

వుదయముననే నిద్రనుండి మేల్కొనినవెంటనే ఆసమయమునకు ముక్కుయొక్క యేరంధ్రమునుండి యూపిరివచ్చుచున్నదో ఆవైపునున్న చేతితో తననోరును తాకవలయును. అనగా నిద్రనుండి మేల్కొనినవెంటనే యూపిరి ముక్కుయొక్క కుడిరంధ్రముగుండావచ్చుచున్నయెడల కుడిచేతితోను, యెడమరంధ్రముగుండా వచ్చుచున్నయెడల యెడమచేతితోను తననోరును తాకవలెను. ఇది అయినతరువాత లేచికూర్చొని అరచేతిలోయున్న రేఖలలో మశ్చరేఖవున్నయెడల మశ్చరేఖనుచూచి, ఊపిరి ముక్కుయొక్క యేభాగమునుండి వచ్చుచున్నదో ముఖముయొక్క ఆభాగమును లేక చెంపనుమాత్రమే ఊపిరివచ్చుచున్న భాగమువైపునున్న చేతితో తాకవలెను. తరువాత ఊపిరివచ్చుచున్నభాగము వైపునున్నపాదమును మొదట భూమిపై పెట్టవలెను. ఈయోగాభ్యాసమువలన తనతాలూకు కోర్కెలు అతివిచిత్రముగ యీడేరును. ప్రతివారికి నేదోయొక కోరికయుండును కాబట్టి ప్రతివారును దీనిని అభ్యాసము చేసికొనవలెను. ఇందువలన నష్టముగాని హానిగాని యెంతమాత్రమును యుండదు.

ఈసాధనమును ప్రతివారును విధిగా అభ్యసింపతగినది. ఏవేళయందు ముక్కుయొక్క యేరంధ్రముగుండా యూపిరివచ్చుచున్నదో తెలిసికొనుటకు అప్పుడప్పుడు పరీక్షించిచూచినయెడల తెలియును. ఈసాధనమువలన మానవులకనేక లాభములుండును.

---

# ఊపిరి యొక్క రాకపోకలచే ప్రేమను పొసగుట.

ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా వచ్చుచున్న యూపిరి పురుషనాడి యనియు, యెడమరంధ్రముగుండా వచ్చుచున్న యూపిరి స్త్రీనాడియనియు యందురు. పురుషులకు ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా యూపిరివచ్చునపుడును, స్త్రీలకు యెడమరంధ్రముగుండా యూపిరివచ్చునపుడును ఒకరియందొకరికి ప్రేమానుబంధము కలుగును.

పురుషులకు ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా యూపిరి వచ్చునపుడును, స్త్రీలకు యెడమరంధ్రముగుండా యూపిరివచ్చుచున్నపుడును ప్రేమానుబంధ మెక్కువయగును కాబట్టి అట్టిసమయమందే ప్రేమాతిశయ సంబంధమైన పనులు మొదలైనవి జరిగించవలెను.

ఈయూపిరిసాధనములయొక్క రహస్యములు ఋషులకు తెలియును కాబట్టి దంపతులయొక్క అనుకూలదాంపత్యము, అనురాగము హెచ్చుగుటకు ఈదిగువరీతిగా చెప్పిరి. పండుకొనునపుడు భర్తకు యెడమప్రక్కను భార్య పండుకొనవలెను. భార్యాభర్తలొకరివైపొకరు తిరిగి పండుకొనునపుడు భర్త యెడమవైపు ఒత్తిలి యూపిరి ముక్కుయొక్క కుడిరంధ్రముగుండా వచ్చుటకు వీలుగానుండునటుల పండుకొనవలెను; భార్య తనకుడివైపు వొత్తిగిలి యెడమరంధ్రముగుండా యూపిరివచ్చుటకు వీలుగానుండునటుల పండుకొనవలెను. ఇట్లుపండుకొనుటవలన దాంపత్యప్రేమయు, ఒకరియందొకరికి దయయు హెచ్చగును. ఇట్లుచేయుటవలననే హిందువులలో దంపతులకు తకాలమంతయు ఒకరియందొకరికి ప్రేమయుండుటకు కారణము.



“జీవితకాలమంతయు కండ్లకు చత్వారములేకుండను, పండ్లూడిపోకుండను, తలవెంట్రుకలు నల్లగనుండుటకును సాధనములు”

జీవితకాలమంతయు అనగా ముసలికాలములోనైనను కండ్లకు దృష్టిపదమునకు ఏవిధమైనలోపము రాకుండ చేయుటకుగాను ప్రతిరోజును స్నానముచేయుటకుపూర్వము తనకాళ్లవ్రేళ్ల గోళ్లలో మంచి ఆవనూనెను పోయవలెను. ఇట్లుచేయుటవలన, ఈనూనె కండ్లకు ఏవిధమైనలోపములేకుండా చేయును. ఈసూక్ష్మపద్ధతి ననుసరించి ప్రతిరోజును చేసినయెడల కండ్లకుఅద్దములు వాడుక చేయనవసరముండదు.

జీవితకాలమంతయు, అనగా వృద్ధావస్థలోనైనను పండ్లూడిపోకుండ యుండుటకు కాలవిరోచనమగుచుండగా క్రిందిపలువరుసను మీదిపలువరుసతో గట్టిగనొక్కవలయును, ఈసాధనమనేక వేలప్రజలవల్లచేయబడి ముసలికాలమందైనను పండ్లూడవన్నది నిర్ధారణచేయబడినది. కదలుచున్నపండ్లుకూడను యీసాధనమువల్ల మరల గట్టిగనగును. ఇయ్యది అనుభవరహస్యము.

జీవితకాలమంతయు అనగా వృద్ధావస్థయందు కూడను తలవెంట్రుకలు నల్లగనుండవలెనను కోరికగలవారు ప్రతిరోజును మధ్యాహ్నము భోజనమైనతరువాత ౧౦ నిమిషములవరకును తమజుత్తును శుభ్రమైనకొమ్ముపన్నితో గట్టిగను భద్రముగను దువ్వుకొనవలెను. పన్నియొక్క పళ్లు జుత్తులోనుండి తల వుపరిభాగమునకు తగిలేటట్టు నొవ్వకుండా దువ్వుకొనవలెను. కొమ్ముపన్నితప్ప తదితరపన్నులతో యెంతమాత్రము దువ్వుకొనకూడదు. ఈసాధనము చాలసులభమైనప్పటికిని ప్రతివారును చేసినయెడల చాల చిన్నవయస్సులోనే, జుత్తుపండిపోవుట వాపివేసి, తలనొప్పులువగైరా జబ్బులను రాకుండ చేయును. ఈసాధనములన్నిరకముల వాతములకు దివ్యౌషధము వంటిది. ఇదివరకు వాతముచే బాధపడుచున్న వారి సాధనముచేయు

టవలను అట్టి వాతబాధలుపోయి కులాసాగానుందురు. వెక్కిలిగాలి దిమటువలన యూడిపోవు జుత్తునుయూడిపోకుండ చేయును. ఈబాధలెవరికుండునో వారీపద్ధతిననుసరించి తప్పకుండా చెయ్యవలెను. ఇందువలన లాభమున్నదికాని ప్రమాదమెంతమాత్రము లేదు.

---

"అదృష్టవంతులగుటకు కొన్నిరహస్యములు."

మారకీ యాకు పైని తనపేరును పసుపుతోను, వ్రాసితేనెలో నుంచవలెను. ఈవిధముగా అప్పుడప్పుడు చేయుచుండవలెను. ఇట్లుచేసినయెడల వారమురోజులలోగా అదృష్టముపట్టును. ఈలాగు అప్పుడప్పుడు చేయుచుండవలెను.

---

"ముసలికాలమైనప్పుడు కూడ యౌవనముగా నుండుటకు సాధనములు."

మంచితియ్యటిపెరుగులో సగము నీరునుపోసి పంచదారనుకలిపి ప్రతిరోజును ఉదయమునే అర్ధసేరుగాని, మూడుపావుసేర్లుగాని, సేరుగాని త్రాగవలెను. ఎవరైననీరీతిగా ఒకమాసమురోజులు చేసినయెడల ఈసాధనముయొక్క లాభమును అత్యద్భుతమని తెలిసికొనగలరు. ఈవిధముగ ప్రతిరోజును వుదయము చేసినవారు క్రమేణ వృద్ధావస్థనుండి తొలగింపబడి వ్యాధులన్నియుపోయి యౌవనవంతులయి, ఆరోగ్యవంతులై చాలకాలము జీవింతురు. స్వర్గమందున్న దేవతలకు అమృతము సౌఖ్యమునిచ్చునట్లే ఈసాధనముకూడను భూమిమీద నివసించు మానవులకు చాల సౌఖ్యమునిచ్చును. ఎవరు ఈరీతిగా శుభ్రముగాను, శుచిగాను తయారుచేసుకొని ప్రతివుదయము పుచ్చుకొందురో అట్టివారు ఏవిధమైన బాధలులేక కులాసాగా నిరోగులైయుందురనుట నిస్సంశయము.



చల్లనినీళ్లను, పాలును, తేనెయును, ఆవునెయ్యియును, ఈ 4 వస్తువులనుగాని, వీటిలో మూడింటినిగాని, రెండింటినిగాని, కలిపి ప్రతిరోజును చీకటినే వుదయమున త్రాగినయెడల మంచియౌవనముగ ముసలికాలమువచ్చినను యుందురు. తేనెయెంతయుండునో దానికి రెండింతలు నెయ్యియుండవలెను, కాని తేనె నెయ్యి సమభాగములుగా యెంతమాత్రము కలుపకూడదు.

---

"ఊపిరియొక్క రాకపోకలవలన శత్రువులను స్నేహితులుగచేసికొను విధము."

ఎవరికైనను శత్రువ్లు బాధపెట్టుచున్నయెడల అట్టిశత్రువులకు యీక్రింది విధముగ చేసినయెడల మిత్రులుగచేయవచ్చును:— ఒకగిన్నెనిండ నీళ్లనుపోసి సూర్యునికెదురుగా నిలువబడి తనశత్రువు తనకు మిత్రువులవుగాక యని ధ్యానించుచు గిన్నెలోనున్ననీరును ముక్కులోనికి పీల్చవలయును.' ఇట్లు ప్రతిరోజును చేయుటవల్ల, కొద్దికాలములోనే తనశత్రువుకు యిదివరకున్న శత్రుత్వముపోయి మిత్రస్వభావము కలిగి పశ్చాత్తాపమును పొందును.

---

"ప్లేగుజాడ్యమును, మన్యపుజ్వరమును (మలేరియా) రాకుండ యుండుటకు సాధనములు."

పట్టణములోకాని తానునివసించుచున్న చుట్టుప్రక్కలనుగాని ప్లేగు కనపడినవెంటనే వేడినీటిలో కొంచము సైంధవలవణమును కలిపి ప్రతిరోజును ఉదయముననే పరగడుపున త్రాగవలెను. ఈపద్ధతి ప్రతిరోజు ననుసరించి ప్రతివారును చేసినయెడల ప్లేగునుండి విముక్తులగుదురు. ఉప్పునీరును త్రాగినయెడల మన్యపుజ్వరము (మలేరియా) నిస్సంశయముగా పోవును. ఉప్పునీరునుచేయు పద్ధతి:— మూడులేక నాలుగుఔన్సులు త్రాగుటకు పనికివచ్చే మం

నీళ్లలో ఉప్పును కొంచెము అనగా నీళ్ళుఉప్పగానున్నవాలేవా అను సంశయము పుట్టువరకు జాగ్రతగా చూచుకొనుచు కలుపవలెను. ఈనీరునే ప్రతిరోజును ఉదయమున త్రాగుచుండవలయును. పంచదార వేయకుండ తయారు చేసిన తేనీరు కూడను పై వుప్పునీరువలె పనిచేయును. మన్యపుజ్వరముతోను కడుపులో బల్లచేత వచ్చిన జ్వరముతోను బాధపడుచున్నవారు సాయంత్రముకూడ పై చెప్పినప్రతికారము త్రాగవలెను.

---

"కలరాయును, మసూచికము, ఆటలమ్మ మొదలైన భయంకర జాడ్యములు రాకుండ కాపాడుకొను విధములు."

కరక్కాయ పిక్కకు కన్నముచేసి మగవారైనయెడల కుడిచేతికిని, ఆడువారైనయెడల యెడమచేతికిని త్రాడుతో కట్టుకొనినయెడల కలరామొదలైన జాడ్యములు నిశ్చయముగ రావు.

కలరాకు:— ఏనుగుదంతముతో చేయబడిన దువ్వెనను వాడుకచేయువారెన్నడును కలరావల్లబాధపడరు.

జిల్లేడుపూవులుదెచ్చి వాటిని యెండబెట్టి పిమ్మట చూర్ణముగాజేసి దానిని గులిమిందగింజ యెత్తుగల మోతాదుతినిన కలరాజాడ్యము నశించును.

బోడసరపు కాయలను దెచ్చి వాటిని దండగాగూర్చి మసూచిగలవారికి మెడనుగాని, చేతికిగాని, గట్టినవెంటనే మసూచిమాయమగును. మసూచిహెచ్చుగా నున్నవారికి బోడసరపుకాయలను తినిపించియు, దండగాగూర్చి కట్టుటయునుగూడ జేయవలెను.

ఇయ్యది అనుభవరహస్యము.

మరా:— ముఖ్యముగా చదువరులకు పైవాటియందు నమ్మకమే ప్రధానము.

---

# దినచర్య

అను

—ప్రతిరోజూ తెలుపు గొప్ప జ్యోతిషగ్రంథము—

—: అత్యద్భుతము :—

ఇది సులభమైన తెలుగులో అందరికిని బోధపడునట్లు వ్రాయబడినది.

ఇది ప్రతిరోజును జరగబోవు ఫలములను తెలియజేయు పుస్తకము. యీ పుస్తకము ప్రతివారు చదువుటకు తగిన సుప్రసిద్ధ జ్యోతిషగ్రంథము. ప్రతివారికిని అతిసులభముగ బోధపడును. యీపుస్తకము ప్రతివానియొక్క భవిష్యత్తును రోజువారీగా యెంతకాలమువరకైనను తెలియజేయును. ఇది యెంతకాలమువరకైనను దశా అంతర్దశా ఫలముల నిచ్చును. యీగ్రంథరాజముయొక్క సహాయ్యముచే ప్రతివారియొక్క స్వాభావిక ఫలములను, రూపురేఖలను తెలిసికొనవచ్చును. యీగ్రంథరాజము అబద్ధపు జ్యోతిష్కుల పాల్బడకుండ ప్రతివారిని కాపాడును. జ్యోతిషమును మిక్కిలి సులభముగా నేర్చుకొనుటకును, ముందు తోచిన తెలుసుకొనుటకును యీపుస్తకమునకు సరియైన పుస్తకము మరియొకటి లేదు.

ప్రపంచమునందు వెలువడిన యిట్టి జ్యోతిషగ్రంథములలో నియ్యది ప్రథమగ్రంథము. తరతరములనుండి వచ్చుచున్న జ్యోతిష్కులయొక్క అనుభవముతోను యోగీశ్వరులయొక్క అనుభవజ్ఞానముతోను యీపుస్తకము నిండియున్నది. కాబట్టి యీపుస్తకము ప్రతివారివద్దను వుండతగినది. యీపుస్తకమొక్కటి యున్న మరి యితర జ్యోతిషగ్రంథములయొక్కయు, జ్యోతిష్కులయొక్కయు, అవసరముండక యెవరికివారే జ్యోతిష్కులగుదురు.

యీపుస్తకమును తెలుగు నాంగ్ల (English) భాషలో చదివిన వారియొక్క యోగ్యతాపత్రములను యీక్రింద పొందుపరచితిమి.

## — యోగ్యతాపత్రములు. —

(1) కే. సి. ఆరోరాగారు, యమ్. యే., యల్ యల్. బి., యమ్. ఆర్. యే. యస్., హైకోర్టు వకీలు, రూర్కీనుండి తే 12.12-1922 దీని యిట్లు వ్రాసిరి:— "హిందూదేశపు గొప్ప జ్యోతిషగ్రంథమును" చదువుట వలన నేనెంతయు కుతూహలుడనైతిని. ఇయ్యది జ్యోతిశ్శాస్త్రమును గూర్చిన మంచి గ్రంథము. జ్యోతిషమును బాగుగ నెరిగియున్నవారికిని ప్రారంభకులకునుగూడ నిది మిక్కిలి యుపయోగమైనది. ఇది చక్కగ బోధపడునట్లు వ్రాయబడినది."

(2) సి. జే. సల్లివాన్ గారు, పోలీసు రిజర్వు యినస్పెక్టరు, బిలాస్పూరునుండి తే 6.8.28 దీని యిట్లువ్రాసిరి:— "హిందూదేశపు గొప్పజ్యోతిష గ్రంథమును" నేను చదివితిని. అది నాకు మిక్కిలి అభిరుచిని గలిగించినది."

(3) యే. యస్. హ్యూగ్స్ గారు, "విడ్డికోమ్," కసౌలీ, పంజాబ్ నుండి తే 20-8-28 దీని యిట్లువ్రాసిరి:— "హిందూదేశపు గొప్ప జ్యోతిష గ్రంథము" నాకు మిక్కిలి కుతూహలదాయకమగు గ్రంథము. నేను దానిని పూర్తిగ దఫదఫాలు జదివితిని."

ఇంకను యనేక యోగ్యతాపత్రములను అందుకొంటిమి. గ్రంథ విస్తర భీతిచే యిచ్చట వ్రాయలేదు. వేయేల పుస్తకము ఒక్కసారి తెప్పించి చూచిన పుస్తకముయొక్క ప్రాముఖ్యత చదువరులకు తెలియబడగలదు.

☞ ఒకప్రతి వెల పోష్టు ఖర్చులు కాక రు 1—8—0. రెండు ప్రతులు ఒక సారి కొనువారికి పోష్టు ఖర్చులు సహా 2—8—0. మూడుప్రతుల వెల పోష్టు ఖర్చులు సహా రు 8—0—0. పుస్తకములు వలయువారు యీక్రింది చిరునామాకు వ్రాయవలెను.

శ్రీకళింగ జ్యోతిషనిలయము,
విజయనగరము, (విశాఖపట్నం జిల్లా.)

సిటీ ప్రిమియర్ ప్రెస్, విజయనగరం సిటీ.

# అసంపూర్తివిద్య చాలప్రమాదకరము

దయచేసి యీదిగువ సంగతులను చదువుడు.

మాజ్యోతిష గ్రంథరాజములనుజూచి, జ్యోతిషప్రమేయ మేమియూ బాగుగ తెలియకనే ధనము సంపాదించుటయే ముఖ్యోద్దేశముగా పెట్టుకొని జ్యోతిషగ్రంథములను వ్రాయువారనేకులు గలరు. అట్టివారిచే వ్రాయబడిన గ్రంథములను పూర్తిగ పరీక్ష చేయక కొనినవారు ధనవిషయమై మోసపోవుటయే కాక నిజమైన లాభమును బొందజాలరు.

"అపూర్వ జ్యోతిష గ్రంథరాజములు."

ఈదిగువ నుదహరించిన మూడుపుస్తకములు చదివినవారు నిస్సందేహముగా జ్యోతిష్కులు కాగలరు. ఈపుస్తకములు చాల సులభశైలిలో చక్కని తెనుగులో వ్రాయబడినవి. ఇట్టిపుస్తకములు ఎన్నడును యిదివరకు ప్రచురము కాలేదు. గురువు నక్కరలేకయే జ్యోతిష్కులగుటకు యీపుస్తకములే ఆధారములు

1. జ్యోతిషరహస్యము ఒకప్రతివెల రు. 2-8-0.
2. అద్భుతభవిష్యత్ ఫలదర్శిని ఒకప్రతివెల రు. 1.0.0.
3. "హెవెన్సుఅన్వొయిల్డు" అను అద్భుతజ్యోతిషగ్రంథము. సర్వజనోపయుక్తమగు పుస్తకమాణిక్యము. ఒకప్రతివెల రు. 2-0-0.

ఈపైమూడుపుస్తకములనుగూర్చి అనేకవందలకొలది యోగ్యతాపత్రములు పొందబడినవిగాని గ్రంథవిస్తరభీతిచే యిందు వ్రాయలేదు. ఈమూడుపుస్తకములు ఒకేసారి కొనువారికి పోష్టుఖర్చులుసహా రు. 4-0-0లకే యివ్వబడును. పుస్తకములు వలయువారీదిగువ చిరునామాకువ్రాయవలెను:— కళింగజ్యోతిషనిలయం,
పోష్టు విజయనగరం, విశాఖపట్నం జిల్లా.

మహారాజశ్రీ, ప్రొఫెసరు ప్రకాశరావుగార్కి
ప్రొప్రయిటరు, కళింగఆస్ట్రాలాజికల్ బీరో, విజయనగరం.

మహాశయా,

మీచే వ్రాయబడిన జ్యోతిష గ్రంథరాజములన్నియు పూర్తిగా చదివితిని. నిశ్చయముగా అవియన్నియు మనహిందూ

దేశముయొక్క గుప్తధనమని చెప్పవచ్చును. నాకిదివరకు జ్యోతిషమనేమో తెలియకపోయినప్పటికీ మీగ్రంథరాజములు నేను చదివినపిమ్మట నేనుజ్యోతిషములో కొంతజ్ఞానమును సంపాదించితినని మిక్కిలి సంతోషముతో మీకుతెలుపుచున్నాడను. మీయమూఢునకైనను యీజ్యోతిషశాస్త్రము అతి సులభముగా బోధపడునట్లును, మీజ్యోతిష గ్రంథరాజములన్నియు, జ్యోతిషశాస్త్రమేమియు తెలియనివారు చదివినప్పటికిని మంచిజ్ఞానము సంపాదించునటుల మీరు అతిసులభశైలిని అందరికిని బోధపడునట్లు ఈపుస్తకములు వ్రాసినందుకుగాను నామనఃపూర్వకముగా నేనెంతో సంతసించుచున్నాడను.

ఇట్లు,

రాజా కుమారస్వామి రాజాబహద్దూరువారు,
యువరాజా, కార్వేటినగరు,
చిత్తూరుజిల్లా, తేది. 24-2-1928.

శ్రీరాములు.

మహారాజశ్రీ, తేదీ 8—3—1928.

ప్రొఫెసరు ప్రకాశరావుగారు, ప్రొప్రయిటరు, కళింగఎస్ట్రా
లాజికల్ బీరో, విజయనగరం, విశాఖపట్నం జిల్లా.

మహాశయా,

మీరు యిదివరకు నాకు పంపించిన, జ్యోతిషరహస్యగ్రంథములు:— 1. జ్యోతిషరహస్యము, 2. హెవెన్లీ అన్వెయిల్డ్, 3. అద్భుత భవిష్యత్ ఫలదర్శిని, యీమూడు పుస్తకరాజములు నాకు చాలా ఆనందమును శ్రద్ధయు కలిగించినవి. యీ జ్యోతిషవిద్య మిక్కిలి కష్టమైనప్పటికిని, మీరు మీయొక్క కుశాగ్రబుద్ధిచేత తెలుగులో, మూఢునకు సహితము జ్యోతిషమున నేమో తెలియునట్లు వ్రాసితిరి. ఆంధ్రదేశమిందులకు మిక్కిలి గర్వించవలసియుండును. నాకు పైమూడు పుస్తకరాజములు తృప్తికలిగించినందులకు నాయొక్క నమస్కారములు.

నెం 404—స్ట్రెండ్ రోడ్,
తూర్పు రంగూను, బర్మా.

ఇట్లు,
జి. టి. రామారావు, మర్చంటు.

